# మహారాజ్ శివాజీ

( దృశ్య నాటిక )

రచయిత :

A. సూర్యప్రకాశశర్మ B. A. B. L.

కాళహస్తి తమ్మారావు అండ సన్సు,

గ్రంథప్రకాశకులు : : రాజమహేంద్రవరం.

# పాత్రలు

శివాజి

తానాజి

రామదాస్

జయసింహుడు

బలదేవ్‌సింగ్

తుకారామ్

ఔరంగజేబ్

దిలేర్‌ఖాన్

మోరోపంత్

వైద్యుడు

జిజియాబాయి

# మహారాజ్ శివాజీ

## 1 వ దృశ్యము

( తెరలో దేవీ స్తవము చేయుచుందురు )

గేయం

వందే గౌరీ మాతా !
వందే పావన చరితా !
ఆశ్రితపోషిణి శర్వాణీ
అభయప్రదాయని భవురాణీ
వందే గౌరీ మాతా !
వందే పావన చరితా !
నిగమనివేదిత సంపూతా
నిర్మల చరితా విఖ్యాతా
వందే గౌరీ మాతా !
వందే పావన చరితా !

( బీజపూర్ సుల్తాను కుమార్తె రోషావేశపరవశయై నిలువబడును)

శివాజీ :—( ప్రవేశించి ) అమ్మా ! మీ రెవర్లు ?

సమాధానమురాదు.

శివాజీ :—అమ్మా ! తమ నామధేయము తెలుసుకొనవచ్చునా ?

సుల్తాన్ కుమార్తె :—మీ సర్వసేనాధిపతిని ప్రశ్నించిన దేలును.

శివాజీ :—అమ్మా ! నీవు శ్రీ బీజపూరు సుల్తాను కుమార్తెవా ?

దుహిత :—అవును. కాని, శుద్ధ ముసల్మాను వంశమున జన్మించిన యువతిని. మానమును ప్రాణముకన్న నెక్కుడుగ ప్రేమించు మానవతిని.

శివాజీ :—అమ్మా! శాక్తేయుడు, శ్రీ సమర్థరామదాసు ప్రియ శిష్యుడు, శ్రీ శ్రీ జిజియాబాయి ప్రియపుత్రునిచెంత నాకు భయము లేదు.

( సుల్తాను కుమార్తె బాకు పైకి తీయును )

( శివాజీ ఆ బాకును చూచి నవ్వి ) అమ్మా! మహారాష్ట్రవీరులు శత్రుకృపాణములను చూచి జంకరు. హృదయమున పరిభ్రమణమొందుచు, వెలిబుచ్చుటకు సాధ్యముకాక హృదయ గ్రంథులను దహించుచున్న భావపరంపరలచే నుడికెత్తిన అశ్రుజాలముచే నిండిన చంచల నేత్రములను గాంచి జంకును. శాత్రవ కుటిలరాజనీతిని గాంచి భయవిహ్వలితచిత్తుడై భారతీయుడు దాసోహ మనడు. అనింద్య సౌందర్యమున దానారాధించు జగజ్జననికోపమును గాంచి భక్తిపారవశ్యమున ముగ్ధుడై దాసోహమనును. లోహనిర్మిత శస్త్రములు భక్తిపూరిత హృదయముల భేదింపలేవు.

దుహిత :—శ్రీ శివాజీ సార్వభౌమా! జగజ్జనని నారాధించి తత్ప్రసాదమున శాత్రవుల జయించెద వను విఖ్యాతిగాంచిన నీకు శుద్ధాంతఃపురమున వసించు మానవతుల సౌందర్యముపై నింత మమత యేల ?

శివాజీ :—సోదరా! సర్వసేనాధిపతి యభిప్రాయమును నీవు గ్రహించి యుండవు. భగవానుని సృష్టియందు విరాజిల్లు నసమానా

సౌందర్యమును జూపించి తన నృపాలుని ధన్యుని జేయ యత్నించి యుండును.

దుహిత :—భూపాలా ! చతుష్పాద జంతువు నదీ సమీప మందున్న పచ్చికబయళ్ళ విహరించును. నదీ ప్రవాహమున బడి మరణించునని దానికి తెలియదా ! భీకర సింహ శార్దూలాది సత్త్వ సంకులిత కాంతారముల విహరించు కురంగమునకు హర్యక్ష తీవ్ర నారాచ సన్నిభ నఖరముల బాధ తెలియదా ! ఆ విధముగనే మీ సైనికులకు నృపాలుని హృదయము తెలియును.

శివాజీ :—అమ్మా ! పొరబడుచుంటివి. ఎవరు అక్కడ ? సర్వసేనాధిపతిని పిలువుము. అమ్మా ! సామాన్య భారతీయుడై నను రామాయణ, మహాభారతాది గ్రంథ పరిచయము వలన పురోభివృద్ధిని కాంక్షించువాడు స్త్రీని మాతృభావమున బూజించును. అట్టియెడ శ్రీ జగద్గురు సమర్థ రామదాస భక్తావతంస తుకారాము పూజ్యపాద శ్రీ శ్రీ జిజియాబాయి ఆశీర్వాదముల దిన దినాభివృద్ధి జెందుచున్న మహారాష్ట్ర జాతి కాముకదృష్టితో యువతిని జూడ గలదా !

( సేనాపతి ప్రవేశించి నమస్కారము చేయును )

శివాజీ :—సైన్యాధ్యక్షా ! ఈ యమ రాకకు కారణము ?

సైన్యా :—ప్రతిక్రియ.

శివాజీ :—ప్రతిక్రియయా ! వీరవర్యా ! శత్రుసేనల చెండాడి పొందిన యశమును మలినమొనర్ప జాలు నీ భావము నే నీచుడు నీహృదయమున ప్రవేశింపజేసెను ?

సైన్య :—ప్రభువర్యా !

శివాజీ :—నే నొక్క మాటయైనను సైరింపను. ఈమె భారతీయ స్త్రీ. యేజాతికి సంబంధించినను శక్తి స్వరూపిణియే. మనకారాధ్యదేవతయే. కనుక, సత్వరముగ నీమెను సత్కరించి, పితృగృహమున దించి క్షమ వేడి రమ్ము, లేనిచో శివాజీ ఖడ్గధారల రుచి చూడగలవు.

గేయం

భారతనారీ సామాన్యంబా
శూరసంధాత్రి యీ యంబా !
జాతివైరైన భారతభూమిని
సంచరింపదా యీసాధ్వీ !
భారతనారీ సామాన్యంబా
శూరసంధాత్రి యీ యంబా !
పూలమాలలను భక్తి మీరగా
పూజనీయమే యీ తల్లీ !
భారతనారీ సామాన్యంబా
శూరసంధాత్రి యీ యంబా !
శక్తిస్వరూపిణికి అవమానంబు
సలుపుట తగదూ చాలుచాలురా !
భారతనారీ సామాన్యంబా
శూరసంధాత్రి యీ యంబా !

సేనా :—చిత్తము !

శివాజీ :—అమ్మా ! మూర్ఖులను పాలించు నృపాలురు కళంకితులగుటలో నాశ్చర్యమేమున్నది ? ఆ యపరాధమునకు క్షమిం

పుము ! కాని, నీ వంటి యనింద్య సౌందర్యముకల తల్లియే నా కున్నచో, నే నెంత ధన్యుడనో ! సదా జగజ్జనని నామెలో గాంచి ఆమోదించుటకు మంచి యవకాశ ముండియుండునుగదా !

దుహిత :—శివాజీ సార్వభౌమా ! నే నెంతయో ధన్యురాలను. లోకైకపురుషుని గాంచి, సమస్కరించి తరించు సదవకాశమును భగవంతుడు నా కొసంగెను. మీ సర్వసేనాధిపతి నన్ను బంధించి కొని వచ్చునపుడు నే నొక నరరూప రాక్షసుని, పరస్త్రీ వాంఛాంధుని, వంచకుని చూచి, యాతని జంపుటయో లేక యాతని చేతులలో మడియుటయో యగునని నిశ్చయించితిని. కాని, నేడు నా యెదుట, విశ్వనేతను, లోకైక జనకుని చూచితిని, జన్మ ధన్యమైనది.

శివాజీ :—అమ్మా సెలవా !

దుహిత :—పూజ్యజనకా ! మహాత్ములు ముఖస్తుతిని ద్వేషింతురని నాకు తెలియును. కాని, నా హృదయమున బుట్టి, వెట్టిగంతులు వైచుచున్న భావతరంగముల వెలువరింపనిమ్ము ! హిందువులు తమలోగల వైషమ్యములను విస్మరించి, మహమ్మదీయులు కారను భావమును పరిత్యజించి నిన్నెందులకు సేవించుచుండిరో నా కిప్పు డర్థమైనది. నావంటి అనింద్య సౌందర్యము కల తల్లి నా కుండిన నెంత ధన్యుడ నంటివి. నీ వంటి జనకుడు బాహ్యాంత సౌందర్యముగల జనకుడు నేడు నాకు లభించెను. తండ్రీ ! నీ దుహిత నాశీర్వదించి పంపుము.

శివాజీ :—అమ్మా ! స్త్రీత్వమును ప్రదర్శించు జీవితమును గడుపుము.

( సర్వసేనాధిపతితో దుహిత వెడలును )

( తానాజీ ప్రవేశించి నమస్కరించును )

శివాజి :— తానాజీ! మన సర్వసేనాధిపతి కావించిన యుత్కృష్ట కార్యమును వింటివా!

తానాజీ :— ప్రభూ! మహమ్మదీయులు హిందువులపై గావించు యత్యాచారములను ప్రతిదినమును ప్రత్యక్షముగ జూచుచున్న యోధులకు ప్రతిక్రియపై దృష్టి ప్రసరించుట సహజమేకదా!

శివాజి :— తానాజీ! మనము స్థాపింప నెంచినది హిందూ మహారాష్ట్రము, కారణమును మరచిపోయితివా! నేటి మొగలాయీ రాజ్యమున హిందువులు తమతమ ధర్మముల ననుసరించి మానమును గాపాడుచు జీవింపలేకుండుటయే. కనుక, మన నూత్న రాజ్యమున నిర్భయముగ నన్నిమతములవారు జీవింపవలయును.

తానాజి :— కాని, ప్రభువరా! దేవాలయములు నేలమట్టమగుచుండ, పతివ్రతలు మానభ్రష్టలై యసువులను వీడుచుండ, పవిత్ర గృహములు పరశురామప్రీతి యగుచుండ వైదికాచార సంపత్తి గల భూసురులు మద్యమాంసాదుల బలవంతముగ భుజించుచుండ నెవ్వరికి-మీవంటి యుగపురుషులకు గాక, యెవరికి శాంతి యుండును?

శివాజి :— తానాజీ! మన ఆశయము పతితులను ప్రేమించి, పతనమును ద్వేషించుటయే. కనుక మానభంగమునకుగాని, అగ్నిజ్వాలలకుగాని, హత్యలకుగాని, కత్తిపోటులకుగాని యవసరమే లేదు.

తానాజి :— అందులకే మిమ్ములను యుగపురుషులని-

శివాజి :—మహమ్మదీయస్త్రీ యనిన నెవరు ! భారతదేశమున జన్మించిన యువతి కాదా ! ఆమె మన సోదరి కాదా ! ఆమె మాన మును కాపాడుట ప్రతి భారతీయుని విధికాదా !

తానాజి :—నేడు మన తల్లి జిజియా ధన్యురాలు.

గేయం

జాగేల నమ్మయీలీల సన్నుత శీలా
సతతంబు నిన్నే స్మరియింపగ పలుకవిదేలా !
ఆరాధనంబు జేయుచుమ్మ ఆదరింపవా
అనిశంబువేడు మా మొరలను ఆలకింపవా
గతిలేదు లేదు యీ జగతిని గిరిజా ! జననీ
వెతదీర్చరావె మొరవినవె త్రైలోక్యపావనీ !
జాగేల నమ్మ యీ లీల ! సన్నుతశీలా !
సతతంబు నిన్నే స్మరియింపగ పలుకవిదేలా !
దేశసేవకులము మాకు దీవన లిమ్మా
దేశాభ్యుదయంబుగూడ ఆశచూపుమా !
హృదయార్పణంబు జేసితిమి యీశ్వరిరావా
యెదలోని వాంఛలను దీర్పవ హితవునింపవా !
జాగేల నమ్మ యీ లీల సన్నుతశీలా
సతతంబు నిన్నే స్మరియింపగ పలుకవిదేలా !

పూజాసమయమైనది, రమ్ము ప్రసాదమును స్వీకరించెదము

( తెర వ్రాలును )

# 2 వ దృశ్యము

( భిక్షాటనము చేయుచు సమర్థరామదాసు ప్రవేశము )

గేయం

లేరా లేరా కలత వీడర
భారత వీర కుమారా !
గడచిన దినమే ఆయువు తరిగెను
కార్యాలోచన సేయరా !
రేపురేపంచు లెక్కించితివా
అపుడే మరణంబరు దెంచునురా !
లేరా లేరా కలత వీడర
భారత వీర కుమారా !
త్యాగజీవివై దాస్యమున్ వీడి
స్వేచ్ఛా వర్తన నింపరా !
దేశముకోసమె చనిపోవుమురా
దేశాభ్యున్నతి కోరరా !
లేరా లేరా కలత వీడర
భారత వీర కుమారా !

జయ్ శ్రీ రఘువీర్ !

( శివాజీ వచ్చి భిక్షాపాత్ర దానపత్రము వేయును )

రామ :—( నవ్వుచు ) నాయనా, ఇంత తేలిక దానమా
అది భూపాలురకు తగదు.

శివాజీ :—ప్రభూ !

రామ :—అర్ధమైనది కాని, దానము చేయుటకు నీ కధికారము లేదని నా యభిప్రాయము ; రాజ్యము నీది కాదు, ప్రజలది. నీవు ప్రతినిధివి.

శివాజి :—ప్రభూ ! మీ యపార పతితపావనత్వమున ధన్యులైన ప్రజలు కృతజ్ఞతను వెలిబుచ్చుటకు మార్గమును గానక పీడింపబడుచుండ, సాత్త్వికసంపదగల నృపాలుడే న్యాయాన్యాయముల నరసి పాలింప సమర్థుడని ! వేద వేదాంగ పారీణులగు విజ్ఞులు వచించుచుండ, తన కుమారుడు శ్రీ శ్రీ పూజ్య పాదులకు తగిన కట్నమీయలేదు కదా యని జనని సంకోచించుచుండ సర్వపక్షము లామోదింపజేయుటకై సర్వమహారాష్ట్ర ప్రజాపక్షమున నీ దాన మొసంగుచున్నాను.

రామ :—మంచిది నాయనా ! కాని, భోగ భాగ్యముల ననుభవించుచు జీవితమున కలవాటుపడిన నీవు రాజ్యభ్రష్టుడవై పాపచింతల మగ్నుడవు కావా ! అది దేశమునకు ప్రమాదము కాదా ?

శివాజి :—గురుకటాక్షమున నెట్టి జీవితమునైనను గడపుటకు జంకని శక్తి లభించినది. హేమకిరీటమునకు భిక్షాపాత్రకు భేదమును విస్మరించు సంస్కారము మీ దయవలన లభించినది.

రామ :—ఆ సంస్కారము శోధనల కాగగలదా ?

శివాజి :—గురుకటాక్షము !

రామ :—పోయి యీ భిక్షాపాత్రతో నీ యంతఃపురమున భిక్షగొని పిదప, నిరుపేదల భిక్షాన్నముతో దీనిని నింపుము.

శివాజి :— యథాజ్ఞాపయతి గురుదేవః

( అని భిక్షాపాత్రను గొని వెడలును )

రామ :—సోదరులారా ! రఘువీరుని స్మరించి ధన్యులుకండు. రఘువీరుని మించిన అవతారము లేదు. ఆతడే సంపూర్ణావతారము. కర్మవీరుడు. దయాంతఃకరణుడు. ఏకపత్నీవ్రతుడు. ఆతని జీవితమే మనకు ధృవతార. అటులని దానినే జ్ఞానమని భ్రమజెంది మరణింపకుడు. రఘువీరునివంటి మహాపురుషు డున్నచోట సీతామహాసాధ్వి వెంట నంటియే యుండును. అనుకూల దాంపత్యమే మానవ జీవితానికి ఆధారభూతము।

గేయం

మనుజుడై పుట్టితే నేమి రాముండు
వనచరుల గూడితేనేమీ !
సౌందర్యమంతటా నిండినా రూపంబు
సరిలేని భుజబలము చరినున్న వీరుడూ !
రక్కసుల ద్రుంచిన వీరుడా ప్రభువరుడు
యిక్కటుల దీర్చిన హితవాది రఘువరుడు !
రణమందు నిలచితే గెలుపు మారాయునిదె
ప్రాతనుమార ద్రోచుటకు పేరు మారామునిదె
ప్రభుని నమ్మినవారి బాధలే పోయేను
రఘుకులుని సేవింప నరకమే లేదాయె
మనుజుడై పుట్టితే నేమి రాముండు
వనచరుల గూడితే నేమీ !

( ఇంతలో భిక్షాపాత్రతో శివాజీ ప్రవేశించును )

రామ :— నాయనా! ధన్యుడవు! ధర్మమునకై దారిద్ర్యమును వరింప సమర్థుడగువాడే నృపాలుడు. అతడే సత్త్వగుణ విరాజితుడు! అతడే ధర్మమును స్థాపింప కృతనిశ్చయుడై, నిర్మలుడై, నిరహంకారుడై ప్రజల బాలింపగలడు! కనుక. నీ రాజ్యమును పాలించి సుఖుడవై మనుము.

శివాజి :—ప్రభూ! దత్తాపహారణము మిధ్యము కాదా?

రామ :—గుర్వాజ్ఞ అనుల్లంఘనీయమైనది.

శివాజి :—ధన్యుడను. ఈ రాజ్యము శ్రీ శ్రీ జగద్గురు సమర్థ రామదాసస్వామి దనియు, వారి ఉపభోగము కాకుండ నాతని సేవకుడగు శివాజీ పరిపాలించునని లోకము గ్రహించుగాక!

రామ :—త్యాగ మెఱింగిన మానవుడు, సంఘములోను, దేశములోను వృద్ధిజెందుననియు, యోగక్షేమమునకు గూడ త్యాగమే మూలకందమగుటచే దాని ననుసరించి నీవు గ్రహింపుము.

గేయం

ఘనత్యాగంబే గాంచరా
వినరా! కీర్తి గనరా!
ఓ వీర! ధీర! సుకుమారా!

బ్రతుకాశ యెంతయున్న
నున్న-అపఖ్యాతి గూడుచున్న
విషమన్న

ఘనత్యాగంబే గాంచరా
వినరా ! కీర్తి గనరా !
ఓ వీర ! ధీర ! సుకుమారా !
దేశముకోసమె బలియగుచే
తేజోమూర్తివి గానగుచే
యిదె మోదదాయకంబు !
ఘనత్యాగంబే గాంచరా
వినరా ! కీర్తి గనరా !
ఓ వీర ! ధీర ! సుకుమారా !

శివాజి :— చిత్తము !

( అని స్వీకరించును )

# 3 వ దృశ్యము

( జిజియా సింహాసనముపై నుపవిష్టురాలగును. శివాజీ మోకరించి పాత్ర పూజ గావించుచుండ నం బ్రాహ్మణులు వేదపఠనము జేయుదురు )

జిజియా :—నాయనా ! చిరంజీవివై హిందూమహారాష్ట్రమును బాలించుచు శాశ్వతకీర్తిని పొందుదువుగాక !

శివాజి :—అమ్మా ! భోజనము సిద్ధముగ నున్నది.

జిజియా :— ( తన సమ్మతిని జూపును )

( శివాజి :— ఖాద్యద్రవ్యములను ముందిడును )

జిజియా :—శివాజీ ! యా యెదుటి హాలు మనదే కదా ! అచ్చట ఇప్పుడు విందు నేర్పాటుచేయలేదే ! అటకు పోయి భుజించెదము.

శివాజి :—అమ్మా ! రేపు యేర్పాటు చేయుదును. ప్రొద్దుపోయినది. నేడు భుజింపుము.

జిజియా :—( క్రోధమును చూచించు నేత్రములతో) రేపను శబ్దము ముఖమునుండి వెల్వడిన రాజు సమస్త సంపదలను బోనాడి విగతప్రజ్ఞుడై నశించునని నీ వెఱుగవా ! ఈ దినముననే ఇప్పుడే అచట భుజింపవలయును.

గేయం

కుమార ఏదీ నీకున్నఖ్యాతి
దేశాభ్యుదయపు నీతి
స్వదేశస్థ జ్యోతి !
శత్రుసంతతిని చించిచెండాడి
నేత్రపర్వమూ జేయునీధాక

భారత జాతికి జ్యోతి !
భావియువజన గీతి !
కుమార ఏడీ నీకున్న ఖ్యాతి
దేశాభ్యుదయపు నీతి
స్వదేశస్థ జ్యోతి !

శివాజి :—అమ్మా ! ఈ దినమున సాధ్యముకాదు.

జిజియా :—కారణము ?

శివాజి :—ఆ దుర్గము శత్రుహస్తగతమైనది.

జిజియా :—ఎవరు ఆ మాట్లాడునది ? జిజియా తన హృదయములోని యాశయములను నెరవేర్చుకొనుటకై యనేక శ్రమల నొంది సృష్టించిన మహారాష్ట్రీయువకుడా ! శివాజీ ! నీ తంత్రి గుణములే నిన్నాశ్రయించినవా !

శివాజి :—ఆ దుర్గము రాజపుత్ర సురక్షితము. సోదర కలహము వలదని జగజ్జనని శాసించినది.

జిజియా :—శత్రు ఖడ్గములకు జంకిన నృపాలుడు లోకములు పరిహసించునటుల సువర్ణ సింహాసనమున హేమమకుటమును ధరించి యుపవిష్టుడవనేల ? మృత్యువునకు జంకిన మానవుడు బిచ్చమెత్తుకొనిన జీవింపలేడా !

శివాజి :—అమ్మా ! మహారాష్ట్రీల పౌరుషము నీ కపరిచితమైనది కాదు. కాని, జగజ్జనని శాసించుటవలన అంతఃకలహములను మానితిమి.

జిజియా :—భీరువులు తమ హృదయ దౌర్బల్యమును కప్పిపుచ్చ దేవతలపై, ప్రారబ్ధముపై, అదృష్టముపై నిందను మోపె

దరు. మహిషాసుర మర్ధని శత్రువులను సోదర ప్రేమతో సైరింపు మని శాసింపదు. దేవతలు రాక్షసులు సోదరులైనను రాక్షసులను నిర్మూలింప త్రిపురారి ప్రోత్సహింపలేదా! కౌరవ పాండవులు సోదరులైనను శ్రీకృష్ణుడు పాండవులచే కౌరవులను నిర్మూలింప జేయలేదా! జగజ్జనని, శక్తి స్వరూపిణి ఆ విధముగ చెప్పదు. తల్లి!

శివాజి :—నా విశ్వాసము పొరపాటై యుండవచ్చును. నీవు భోజనము చేయుము. ఈ దినముననే కోటను జయించి, యట నీకు భోజన మేర్పాటు చేయుదును.

జిజియా :—రేపే భుజించెదను. ఇంతలో తొందరలేదు.

శివాజి :—నీవు వృద్ధురాలవు. ప్రొద్దుపోయినది.

జిజియా :—నా ప్రతిజ్ఞను నెరవేర్చుచు మరణించినను మేలే. జీవించి నేను సాధించున దేమి? ఏ ఆశయమును నెరవేర్చితినని గర్వించితినో ఆ ఆశయమే భగ్నమైనపుడు జీవించిన ఫలిత మేమి?

శివాజీ :—అయిన సెలవు. ( శివాజీ వెడలి పోవును. )

జిజియా :—మాతృవిధి యెంత భయంకరమైనది! ప్రేమను చెరలోనుంచి శాసించు ధర్మ మెంత కఠోరమైనది! ప్రేమస్వరూపిణులను స్త్రీలు ధర్మమును పాలించుట కష్టతమమే కాని నా ఆశయములను నెరవేర్చుటకు భారతభూమిని శాశ్వతముగ స్వతంత్ర దేశముగా స్థాపించి జీవన్ముక్తురాల నగుదును.

( తెర వ్రాలును )

( తెర యెత్తుదురు )

( గంభీర భావముతో శివాజీ పచారు చేయుచుండును )

( తానాజి పుత్రసహితుడై ప్రవేశించి, నమస్కరించును)

శివాజి :—తానాజీ! రా! కూర్చో! విశేషములేమిటి?

తానాజి :—ప్రభువుల హృదయ సముద్రమును క్షోభింపజేయు తుఫాను నెలుంగ సోదరు డాతురమొందు చున్నాడు.

శివాజి :—( నవ్వుటకు యత్నించి ) చిన్నబాబును వెంటకొని వచ్చితివే; వివాహ వాహ్వానములా!

తానాజి :—తుఫానుచే సముద్రము సంక్షుభితమైనను చంద్రు డాకాశమున నవ్వుచుండుట సహజమే - కాని—

శివాజి :—నా కర్థమైనది. కార్యభారమున నీ వాంఛ నెరవేర్ప జాలమి చింతించుచున్నాను.

తానాజి :—నా మనవి అది కాదు. మా ప్రజలు అమ్మను, మిమ్ములను చూడ తహతహలాడు చుండిరి. కనుక మీరు వచ్చి నప్పుడే వివాహమగును. అదియే మాకు సుముహూర్తము.

శివాజి :—తానాజీ! బంధువు లందరు వచ్చియుండ శివాజీ రాలేదను కారణమును, ముహూర్తము కొచ్చిన వారు సంతో షించెదరా!

తానాజి :—శ్రీ శివాజీ మహారాజు తానాజీ గృహమున జరుగు శుభకార్యమునకు రాలేదనిన బంధువులలో నాతని కెంత తల వంపులో మీ రూహించితిరా! ప్రజాదృష్టిలో తానాజీ, శివాజీ, లెవరు! జిజియామాతృ వీరపుత్రులు, సహోదరులు-

శివాజి :—నేను కాదంటినా? కాని, సింహగడ దుర్గమును జయింపనిదే అమ్మ అన్నం ముట్టనని ప్రతిజ్ఞ బూనినది. ఆ మె

పట్టుదల నీ వెఱింగినదియే. ఆమె వృద్ధ, కనుక, నాకు ప్రథమ కర్తవ్యము సింహగడ దుర్గమును జయించుటయే.

తానాజి :—ప్రభూ ! ఆ సమయమున కూడ తానాజీ జ్ఞప్తికి రాలేదా ! అనేక యుద్ధములలో జయపతాకముల నెగుర వేయుటలో సాయమొనర్చి ప్రక్కనుండి యానంద మనుభవించిన తానాజీ, మీ దృక్పథమున బడలేదా ! ఈ పరివర్తనమునకు గారణము ప్రభు ప్రవచింపవచ్చునా ?

శివాజి :—నీవు వివాహ ప్రయత్నముల నుంటివని యెఱిగియే యుంటిని. కాని, తానాజీని మరచి శివాజీ యొక్క క్షణమైన నుండగలడా !

తానాజి :—దేశ శేవకై యెంత త్యాగమైనను చేయవలయునని శాసించిన మీరు-దేశాభివృద్ధికై యసువులనైన త్యజింప జంకని మీరు-ధర్మమును బాలింప మమకారమును విస్మరించిన మీరు — నేడీ విధముగ వచించుట పరివర్తనమును సూచించుటలేదా !

శివాజి :—అటులన నీ యభిమత మేది ?

తానాజి :—ప్రభువులకు శ్రమ నొసంగక సింహగడమును జయించి, అమ్మ కక్కడ విందుజేసి, మిమ్ములను కొనిపోయి పుత్రునకు వివాహము చేయుటయే.

శివాజి :—రసపుత్రులతో పోరాటమని మరచితివా !

తానాజి :—కాని, రసపుత్రులకడ రాజనీతి మృగ్యమనియు నా రాజనీతి చేతనే వారి కన్నులలో కారమును గొట్టి, సింహగడమును జయించెద ననియు మనవి చేయుచున్నాను.

శివాజి :—ఇరువురము పోయినచో !

తానాజి:—గోటితో త్రుంప ననువగుదానికి గొడ్డళ్ల యవసరమేమి?

శివాజి :—నీవు వృద్ధుడవు.

తానాజి :—మీరు యువకులా !

శివాజి :—నీ వాచరించు మార్గము ?

తానాజి :—వృద్ధ గాయక వేషమున బోయి వారిని శ్రీ శివాజీ మహారాజు కింకరులను గావించి, తదుపరి వారిచే శత్రువులను జయింప జేయుట.

శివాజి :—ఆ దుర్గమును రక్షించుటలో మల్లుల సాయమును రాజపుత్రులు పొందుచుండిరి.

తానాజి :—కన్య జంతువులను సంగీతము సులభముగ జయించును. వారిలో అసంస్కృతమై వెలుగుచున్న విజ్ఞాన దీపము నార్పుటలో సంగీతము చాల సాయము చేయును. ఆ దీప మారిన వెంటనే హృదయములను దొంగిలించుట సులభము.

శివాజి :—కాని, వివాహము మాటయే నాకు కష్టముగనున్నది.

తానాజి :—వివాహమునకు తొందర లేదు.

శివాజి :—కాని............

తానాజి :—ఆ స్థితిలో తమరున్నారు. జగదేక జనకులు-

శివాజి :—అమంగళము ప్రతిహత మగుగాక !

తానాజి :—ప్రభూ ! మహారాష్ట్రి రాజనీతికి పరాజయమున్నదియా !

శివాజి :—జగజ్జనని నీకు మేలు చేయుగాక !

(తానాజీ వెడలనుండ)

(జిజియా ప్రవేశించి) తానాజీ ! పెండ్లిపిలుపులకు వచ్చితివా !

తానాజి :—(నమస్కరించి) అవునమ్మా ! కాని, నన్నింకొక పెండ్లికి పిలుచుటచే పోవుచుంటిని.

జిజియా :—(నవ్వుచు ) వృద్ధుడగు నీకుకూడ వివాహములపై దృష్టి మరలినదే !

తానాజి :—మీవంటి తల్లులు చిన్నతనమున బోధించిన బోధలే అట్టి తత్త్వమునకు మూల కందములు.

జిజియా :—( శివాజీ వైపు చూచుచు ) ప్రభు నాజ్ఞయా !

శివాజి :—నేను వలదనియే వారించితిని. కాని, ఆత్మత్యాగ మొనర్చి తల్లిపై గల గాఢ ప్రేమచేత బయలుదేరు చున్నాడు.

జిజియా :—తానాజీ ! సామాన్యులు జిజియాకు హృదయము లేదని నిందింప వచ్చును. మాతృ హృదయము సదా పుత్రుని సర్వోన్నత స్థానమున నిల్ప యత్నించుచు అనేక శ్రమల నొందును. ఆ త్యాగములను, శ్రమలను వివిధ రస సంఘర్షణ జనించు నుడి గుండములను లోకము గ్రహింపజాలదు.

తానాజి :—కాని, పుత్రులు గ్రహించి యటువంటి తల్లులు కల్గుట మేము ధన్యులమని గర్వించునంతవరకు తల్లులకు మనోవ్యధయేల?

జిజియా :—నాయనా ! పోయి రమ్ము ! అంతవఱకు నీ తానాజీ బాబును మా కడ నుంచుము.

పుత్రుడు :—నేను మాత్రము యుద్ధమునకు పోనా ! నా కత్తి మాత్రము ఒరలోనుండి ఉరకటము లేదా !

జిజియా :—కత్తి దెబ్బలతో సౌందర్యము క్షీణిస్తే పెళ్ళి కూతురు నా కక్కరలేదంటుంది.

పుత్రుడు :—ఆ కత్తి నాటులలో ఉండే ఉత్కృష్టతను గ్రహింప లేని క్షుద్రురాలను నేనే తిరస్కరించి పరిత్యజించెదను.

జిజియా :—( బాలకుని నిమురుచు ) తండ్రికి తగిన కుమారుడవు నాయనా ! చిరంజీవివై తండ్రి ఋణమును దీర్పుము.

శివాజి :—బాబూ ! శత్రు ఖడ్గములనుండి యేర్పడిన — ముందర భాగమున నేర్పడిన గాయములు నీ కీర్తికిని - వీపుపై బడిన గాయములు నీ యపకీర్తికిని చిహ్నములని మరచి పోవలదు.

పుత్రుడు :—అది మా అమ్మ చెప్పిన మొదటి పాఠమే ఆ పాఠమును నేర్చిన బాలికనే ఆమె కోడలుగా స్వీకరించును.

జిజియా :—ఆమె వీరవనిత - వీరమాత —

తానాజి :—అమ్మా ! సెలవా !

జిజియా :— నాయనా ! జయ పతాకతో వచ్చి మా కానందమును గూర్చుము. భవాని ని న్నాశీర్వదించును గాక !

తానాజి మోకరించును జిజియా ఆశీర్వదించును.

శివాజి :—రాజనీతిని మరువవలదు ! అవసరమైనచో వర్తమానమంపుము. భవాని ఖడ్గము వచ్చి, నీ యండ నిల్చును.

( తానాజీ పుత్రసహితుడై వెడలును )

జిజియా :—శివాజీ ! మహారాష్ట్రి రాజ్య సంస్థాపనకు తానాజీ చూపించిన మమత గమనించితివా !

శివాజి :—అతడే నీ పుత్రుడని నా నమ్మకము. నీ వాంఛలను నెరవేర్చుటకై యెంత త్యాగమైనను చేయును.

జిజియా :—శివాజీ, తానాజీలు జిజియా నేత్రద్వయము. మహారాష్ట్రి రాజ్యాకాశమునకు సూర్య చంద్రులు - పూజాసమయమైనది. పోవుదమా !

శివాజీ :—చిత్తము ! ( అని వెడలుదురు )

( తెర వ్రాలును )

## 4 వ దృశ్యము

( పూనా మైదానములో కుటీరము. జయసింహుడు రాజతీవిలో నుపవిష్టుడగును ఎదుట మహారాష్ట్ర రాయబారి నిలువబడి యుండుట చూచి )

జయ :—( నవ్వుచు అవును ) మొగలు పాదుషా ఔరంగజేబు పంపిన వచ్చితిని.

రాయ :—మీరు క్షత్రియ వంశజాతులు. భారతీయులు. ధర్మ సంస్థాపనమునం దత్పరులని మా దేశమున ప్రతీతి. తమ దర్శనము వలన మా నృపాలుడు ధన్యుడని వచింపు మని శాసించెను.

జయ :—మీ నృపాలుడే సరళ మార్గమున సంచరించి, క్షాత్ర మును ప్రదర్శించినచో నేనును ఆతని దర్శనమున గర్వించి యుందును.

రాయబారి :—పూత క్షత్రియ వంశ జాతా ! ప్రాథమికదశలో నూత్న రాజ్యముల పొందు శ్రమలను మీరు మరచిపోయి యుందురు. భయంకర సత్యములతో పోరు మానవుడు సరళ మార్గమున బోయి, దాని నెదిరింప డనియు, శస్త్రముల సాయమున గాని, లోకానుభవము వలనగాని వానిని జయించుననియు, తమకు విశదమే. ఆ మాత్రమున నాతడు పతితుడగునా !

జయ :—కాని, మీ రాజు మృగములతో పోరుటలేదు, నాగరకతయం దున్నతస్థాన మాక్రమించి, హిందువులచే ప్రశంసల నొందుచున్న మొగలాయి సామ్రాజ్యముతో పోరుచున్నాడు. ఆ

సామ్రాజ్యము లలిత కళలను, వాఙ్మయమును పోషించుటలో జగ ద్విఖ్యాతిని పొందినది.

రాయ :—క్షమింప వలయును. నాగరకతకు లక్షణము లవి కావు. సర్వసమత్వము, పరమత సహనము, మానవత్వమునకు ప్రథమ లక్షణము. మానవులకే నాగరకత జంతువులకు కాదు. హిందువుల నామమైన వినుటకు కావలసిన సహనము లేక జిజియా పన్ను విధించి, దేవాలయములను నిర్మూలించి, హిందువులను మత్తేభ పాదముల మర్దించి, వేదములను తగులబెట్టించి, పవిత్ర హిందూ స్త్రీల మానము నవమానించి, చేయరాని దుష్కృత్యములను చేయించి - నేను ముసల్మాను నని చెప్పి ఔరంగజేబు సామ్రాజ్య మున పాలింపబడు ప్రజలు నాగరికులా! మీరు క్షమించినచో వారు - ఆ ప్రజలని కాదు నా యభిప్రాయము — ఆ నృపాలుడు మృగము కాదా! ఆ మృగములను చంపినపుడు సరళ మార్గము ననుసరింప వలసిన యవసర మున్నదియా!

జయ :—కాని, క్షత్రియ వంశజు లాతని సేవించుటకు కార ణము మీ ప్రభువులకు తెలియదా!

రాయ :-తెలియకేమి, ఘనత వహించిన అక్బరు సార్వభౌముని కాలమున తమ తాతముత్తాత లొసంగిన వాగ్దానములను నిల్పుటకు, అంతకంటె సత్యమును నిరూపించి చెప్పవలయు నన్నచో తాత ముత్తాత లొసంగిన రాజ్యములను నిలబెట్టు కొనుటకు. లేనిచో శుద్ధ క్షత్రియ వంశమున జన్మించిన మహా వీరులు - వేదములను తగులబెట్టుట - దేవాలయములను నిర్మూలించుట - వైదికాచార సంపత్తితో జీవించు బ్రాహ్మణుల చిత్రవధ గావించుట - మొదలగు రాక్షస కృత్యములను విడనాడరు - తాము ఆరాధించు కాళీరూపము

లగు పవిత్ర చరితలను కళంకితుల గావింప - అన్య మతముల జేర్చుట చూచి సహించెదరా ? ఆ స్థితిలో మహారాష్ట్రులే యున్నచో మీ రాజపుత్రు లేమని వచించెదరు ? భీరులు పతితులవరా ! కాని, మాకు రాజపుత్రులపై గల యభిమానముచే నా శబ్దములను వాడుటకు జంకుచున్నాము.

జయ :—నీవు వచ్చిన పని—

రాయ :—మీరు కూడ హిందువులే యనియు, హిందూ మతమును, హిందూ జాతిని, ఆర్య సాంప్రదాయములను రక్షించుటలో మీకు కూడ బాధ్యత కలదనియు మీకు జ్ఞాపకము చేయుటయే మా ప్రభుని ఆశయము.

జయ :—సంధి చేసుకొనుటకు రాలేదా ?

రాయ :—రాలేదని చెప్పగలమా ! కాని, సంధి యనునది పవిత్ర శబ్దము. ఇరుపక్షము లన్యోన్య సద్గుణములను గుర్తించినపుడు సాధ్యమగునది సంధి. మహారాష్ట్రులు కూడ వీరులే అనియు, వారు కూడ పవిత్రాశయములకై జీవించు నిరుపమాన దేశ భక్తులనియు, ధర్మ సంస్థాపనార్థమే పోరుచున్నారనియు మీరు గుర్తింపవలయును. మేముకూడ రాజ పుత్రులు, మొగలాయి బాహ్య సౌందర్యమునకు భోగ భాగ్యములకు ముగ్ధులై స్వీయక్షేత్రమును విస్మరించిన పిరికి పందలు కారనియు, స్వాతంత్ర్యమును ప్రేమింపని బానిసలు కారనియు, వైదికాచార సంపత్తిని రక్షింపగోరని నిరీశ్వరవాదులు కారనియు గుర్తింపవలయును. అప్పుడే సంధి పొసగును. మహారాష్ట్రులకు, రాజ పుత్రులకు ఆరాధ్య దేవత శక్తియే యనియు, కనుక, వా రిరువురు సోదరులనియు, వారిరువురు కలసి

హిందూ మహారాష్ట్రమును స్థాపింప వలయుననియు రెండు పక్షములవారు నమ్మవలయును. అప్పుడే సంధి పొసగును.

జయ :— రాజపుత్ర వీరులు మొగల్ సైన్యమును కాంచి భయమొంది మీ వాజు సంధికి యత్నములు కావించు చుండెనని మా కుటీరముల వదంతి వ్యాపించినది. అది నిజమేనా !

రాయ :—ప్రభూ ! అది సామాన్యులు వచించిన వారి మూర్ఖతను సూచించును. కాని, మీ వంటి ప్రభువులు నమ్మిన మే మేమనవలయును. శ్రీ శివాజీ మహారాజు క్షత్రియుడు. రామాయణ, మహాభారతాది పురాణముల విని రణోన్మత్తుడైన భారతీయుడు. శ్రీ శ్రీ పూజ్యపాద జిజియాబాయి యొసగిన హితోపదేశమున దేశ దాస్య విముక్తికై సర్వసంగ పరిత్యాగ మొనర్చి భవానీ ఖడ్గధారి యైన భక్తావతంసుడు. జగద్గురు రామదాసాశీర్వాద తిరస్కృత సమస్త శాత్రవుడు. ఆతడు మొగలు సేనకు జంకునా ! ఆతని సర్వసేనాధిపతి తానాజీ మాట మీరు మరచి యుందురు.

జయ :—అయిన ఈ సంధిలో గల మర్మము ?

రాయ :—శత్రువుల దునుమాడ బోవునపుడు మహారాజు భవానీ దేవాలయమున నొక దినము నిద్రించును. అప్పు డామె శాసించును. ఆ శాసనములను శిరసా వహించుటయే మా ప్రభు విధి. లోక మే విధమున చర్చించినను వారు బాధ జెందరు.

జయ :—ఆమె సంధి చేయమనినదా ! (అని నవ్వబోవును )

రాయ :—క్షమింప వలయును. తమరు హిందువులని మరచి పోవు చున్నారు. తమరు శాక్తేయులు. పౌరుషముకన్న దైవమున కెక్కుడు బల మున్నదని తమరు మరచి పోవద్దు. రావణుని కన్న

బలశాలి, తారకాసురుని కన్న కఠోరనియంత, హిరణ్య కశిపుని కన్న మేధావి, జరాసంధుని కన్న గుర్వాశీర్వాద ప్రమత్తుడు, గజా సురుని కన్న మూఢ భక్తుడు లేడని, ప్రభువుల కెరుకయే. వారే దైవమును విస్మరించి పతితులైరి. కనుక, భయభక్తులు కల్గి తాము హిందువులమని స్మరించి వినుడు.

జయ :—రాయబారీ ! నీవు హద్దు మీరి మాట్లాడుచున్నావని నీకు తెలియదా ! నా సహన శక్తి పరీక్షింప నెంచితివా ?

రాయ :—లేదు ప్రభూ ! రాయబారి ధర్మము సత్యమును వచిం చుటయే. తమ నిగ్రహానుగ్రహములతో మాకు సంబంధము లేదు. తమరు సహనశక్తిని నే వచించునది విన ప్రార్థితులు. తమ రాగ్రహ మొంది సనాతన ధర్మమును విస్మరించి, కృపాణమును జూపించినను, సత్యమును వెలిబుచ్చుటకు జంకము. ఏనాడు శివాజీ చరణము లంటి, దేశమును సేవింప ప్రమాణమును గైకొంటిమో యా నాడే ఈ తుచ్ఛ శరీరములు నశించిన వని నమ్ముచుంటిమి.

జయ :—ఆ కల యేదియో వచింపుము.

రాయ :—ఆమె స్వప్నమందు కాన్పించి, "సోదరులతో కల హింపకుము. రాయబారములకై యత్నింపు" మని శాసించినది.

జయ :—( నవ్వుచు ) మీ ప్రభువు పన్నిన పన్నాగములో మేము పడక యుద్ధమే ప్రారంభించినచో—

రాయ :—అప్పుడు జయము మాదే. ఆమె యాజ్ఞను శిరసా వహించి నందులకు మమ్ముల నాశీర్వదించును. తిరస్కరించి నం దులకు మిమ్ము శపించును. అమ్మ శక్తి కెదురై పోరుకొన శక్తి లేదు కనుక, జయము మాదే యని ముందుగనే విజయోత్స వములను మేము సాగించెదము.

జయ :—రాయబారీ ! నీ వెవరవో ముందు వచింపుము. నీవు సామాన్య మానవుడవు కావు. అప్పుడు నా హృదయమును విప్పి నీకు చెప్పెదను.

రాయ :—తమ హృదయమున రహస్యములు కలవా ?

జయ :—మీ ప్రభువు నెంతవఱకు నేను విశ్వసింపగలను.

రాయ :—సోదరుడు సోదరుని నమ్మునంతవఱకు. మీ రిరువురు ఒకే దేవత నారాధించు భక్తులనియు, మీ రిరువుర శాసించు శక్తి యామెకు కలదనియు నమ్మకము మీ కున్నచో సంపూర్ణముగ నమ్మవచ్చును.

జయ :—(నిశ్చయబడి) అఫ్జుల్ ఖానును చీల్చుటకు భయమును నటించిన రాజకీయ వేత్తలు మీరే నని నా భయము.

రాయ :—అయిన.

జయ :—అంతటి సాహసమే మీ కున్నచో నేను హృదయపూర్వకముగ మిమ్ముల నారాధించి ధన్యుడ నయ్యెదను.

రాయ :—కానిచో ?

జయ :—అవతార పురుషుడైన శ్రీ శివాజీ మహారాజు దర్శనము చేసికొని మీ వంటి రాయబారులను కల్గిన ఆత డెంతయో ధన్యుడని స్తుతింప నెంచితిని.

రాయ :—ప్రభువరా ? మా నృపాలుడు స్తుతులను వాంఛింపడు. వారికి కావలసినది అఖండ హిందూరాజ్య స్థాపనయే. సర్వ సమత్వమే. ఆతడు కిరీటమును వాంఛించుటలేదు. ధర్మసంస్థాపనమే కావలయును. ఆ కార్యమును సాధించుటకు రెండేజాతులు సమర్థములైనవి. రాజపుత్రులు భోగలాలసులై సుఖనిద్ర జెందుచుండుటచేతా నీ కార్యభారమును వహించెను. తమవంటి వీరశిరోమణులా

భారమును వహించినచో, తమ పాదముల నాశ్రయించి యా మకుట మును తమ నెత్తిని బెట్టును. మొగలాయీలు తమ నైచ్యమును పరిత్యజించి, సర్వసమత్వమున బరిపాలించినచో వారికే సేవకు డగును. ఈ రెండును సాధ్యముకావని తమకు తోచినచో మా నృపాలునకు సాయమొనర్ప బ్రార్థితులు.

జయసింగ్ :—ఔరంగజేబున కిచ్చిన వాగ్దానముల మాట ?

రాయ :—మానృపాలుని సిద్ధాంతము 'విషస్య విషమౌషధం'

జయసింగ్ :—మా అంతరాత్మ అంగీకరించదు. మొదట సార్వభౌముని దర్శనముచేయించి గౌరవముగ ప్రవర్తించునటుల జేసి, పిదప నేను చేయ గలిగినంత సాయమును జేయుదును.

రాయ :—ధన్యవాదములు, సెలవా !

జయ :—మీ నృపాలుని దర్శనము-

రాయ :—తమరు సంభాషించినది మహారాష్ట్ర ప్రజాసేవకు డగు శివాజీతోడనే.

జయ :—( ఆశ్చర్యముతో ) శ్రీ శివాజీ మహారాజు తోడనా !

రాయ :—అగును (అని దుస్తులను తీయును )

జయ :—(గాఢాలింగన మొనర్చి) వీరాధివీరా ! నేడు నీవు నా దురహంకారమును సంపూర్ణముగ చూర్ణ మొనర్చితివి. సాహస కృత్యములను పచరించుట రాజపుత్రుల జన్మహక్కని గర్వించు నాకు రాజపుత్రుల భావ వీధినికూడ సంచరింప జాలని సాహస కృత్యమును జూపించితివి. మొగలాయి సామ్రాట్ నీ సద్గుణములను గుర్తింపజాలక పరుల మాటలనువిని - భ్రమలకు లోనై, పతితు డగుచున్నాడు. నీ సాహసకృత్య మాతని హృదయమున పరివర్త నమును గొనివచ్చును. రమ్ము, నా వెంట రమ్ము !

శివాజీ :—ఔరంగజేబు కుటిలుడు. అవమానించును. లభించిన అవకాశమును గొని నన్ను బంధించును.

జయ :—రాజపుత్ర ఖడ్గముల గల తీవ్రత నాత డెఱుంగును. అంత సాహసమున కొడిగట్టడని నా అభిమతము.

శివాజీ :—పొరబడుచున్నారు. మీరు పూజ్యులు కాని, మానవ హృదయములు - మొగలాయి సార్వభౌముల హృదయా లతి గంభీరమైనవి.

జయ :—ఆతడే నా మాటను మన్నించి గౌరవింపనియెడల, అఖండ హిందూరాజ్యము స్థాపింపబడినదనియే నమ్మెము.

శివాజీ :—నన్ను బంధించినచో ?

జయ :—అప్పుడు మహారాష్ట్రుల రాజనీతి - రాజపుత్రుల పౌరుషము మైత్రిని పొందును. శివుని లలాటాగ్ని, బడబానలము కలపిన ప్రళయముగదా !

శివాజీ :—నేను రాకుండ మీరు యత్నింపరాదా !

జయ :—జయింపలేక నేనే జంకితినను అపఖ్యాతి నాకు లభించును. నీ సాహస కృత్యమును చవిచూచిన నేను నీపై కత్తి నెత్తుటయే - జయాపజయముల ప్రసక్తి అటుఉంచుము. ప్రత్యర్థినై నిలువ బడుటయే యనేకతరములనుండి ఆరాధించుచున్న క్షాత్రము నవమానించుట యని తలంచుచున్నాను. కనుక నా ప్రార్థనము నంగీకరింపుము.

శివాజీ :—తథాస్తు !

జయ :—అగ్నిని వస్త్రమున బంధించునంత మూర్ఖుడు ఔరంగజేబు కాడని నా నమ్మకము.

శివాజి :—భిన్నాభి ప్రాయములను చర్యలతో కాక, అనుభవములతో పరిష్కరించుట మంచిదని నా నమ్మకము.

జయ :—సెలవు!

శివాజి :—( నమస్కరించి వెడలును )

జయ :—పరమ భక్తాగ్రగణ్యునకు సాధ్యము కాని దెద్ది? ఎంత సాహసము! ఎంత ధైర్యము! శత్రువుని గుడారమున అద్వితీయుడై ప్రవేశించి, నిర్భయముగ చర్చించుట, జగదైక వీరుడని ప్రసిద్ధి కెక్కిన జయసింగ్ నెదుట యాతని లోపములను చూపించి, యాతని భక్తి శ్రద్ధలను చూరగొనుట, భారతీయ వీరుడు శివాజీ అనుటలో ఆశ్చర్య మేమున్నది?

గేయం

భారత భాగ్య విధాయి!
శూర సన్నుతుడు మా శివాజీ!
 పౌరుష వంతుడు ప్రతిభా శాలీ
 ధీర వంద్యుడూ సన్నుత శాలీ!
భారత భాగ్య విధాయి!
శూర సన్నుతుడు మా శివాజీ!
 స్వేచ్ఛా జీవి నిండిన ఠీవి
 స్వీయ దేశాభి మాని భూజాని!
భారత భాగ్య విధాయి!
శూర సన్నుతుడు మా శివాజీ!

( తెర వ్రాలును )

# 5 వ దృశ్యము

( సింహగడ దుర్గ ప్రాంతమున భిల్ల కుటీరము )

భిల్ల నాయకుఁడు :—మీరు చెప్పినది సత్యమే. మొగలాయి ప్రభువులు మిమ్మ నమ్మట లేదు. ప్రతి క్షణము రాజ పుత్ర యోధులను ఈర్ష్యతో తిలకిస్తున్నారు. కాని, ప్రభు భక్తి కల్గియుం డుట మా ధర్మము కాదా !

తానాజీ :—ప్రభు భక్తి భారతీయుల ప్రధమ లక్షణము. కాని, ప్రభు భక్తి భగవంతుని దయ బొందుటకు మార్గమనియు, గమ్య స్థానము కాదనియు, ఆ మార్గము కుటిలమైనపుడు వేరొక మార్గ మున నైన గమ్యస్థానమును జేరవచ్చు ననియు మీరు మరువరాదు.

భిల్ల నాయకుఁడు :—మాకు మొగలు సామ్రాజ్య మిచ్చుచున్న గౌరవము హిందూ సంఘ మిచ్చుట లేదు. హిందూ సంఘము మమ్మలను బహిష్కరించినది. అవమానించినది.

తానాజీ :—రాజ పుత్రులు కూడ మిమ్మలను పరాభవించిరా ?

భిల్ల :—వారు మమ్మలను కన్న బిడ్డలవలె ప్రేమిస్తున్నారు.

తానాజీ :—వారు హిందువులు కారా !

భిల్ల :—వారిలో హిందూత్వము కంటె మహమ్మదీ యత్వము ఎక్కువ గోచరిస్తోంది.

తానాజీ :—దాన్ని మొగలాయీలు గాని, రాజ పుత్రులు గాని అంగీకరిస్తారా ! గౌరవానికి గాని, ధనానికి గాని, హక్కులకు గాని దేశసేవ చేయటము మీ గౌరవాని కెంత లోపమో గుర్తిం

చావా? దేశసేవ చేయటము నీ విధి కనుక, చెయ్యి. భగవంతుడు సంతోషిస్తాడు కనుక, దేశాన్ని ఆరాధించు. ధర్మము కొఱకు పోరాడి నీ రక్తాన్ని ధారపొయ్యి. నిన్ను గౌరవించ వలసిన పంధాను, నీ కీయ వలసిన హక్కులను, చర్చించి తేల్చవలసిన బాధ్యతను సంఘానికి వదలు.

భిల్ల : మేము రాజ పుత్రులను వదలి జీవించలేము. వారికి మాకు అంత గాఢమైన ప్రేమ ఉంది. అది తరతరాల నుండి వచ్చిన సంబంధము.

తానాజి :— వా రంగీకరిస్తే మీకు సమ్మతమేనా!

భిల్ల :—వారు గంగలో దిగమంటే దిగుతాము. వెనుక ముందు లాలోచించము.

తానాజి :—ఇంకా బలదేవ్‌సింగ్ రాలేదే?

భిల్ల :—ఈ పాటికి వస్తుంటారు.

( బలదేవ్ సింగు ప్రవేశించును )

భిల్ల :—నమస్కరించి - వీరే నేను చెప్పిన గాయకులు.
( బలదేవ సింగు నమస్కరించి ) మీ దర్శనము వలన ధన్యుడను.

తానాజి :—నాయనా! మానవుల దర్శన మాత్రాన మానవుఁడు ధన్యుఁడు కాఁజాలఁడు. ఆతనిలోఁ గల గొప్పతనమును గుర్తించి, ఆ లక్షణమును తన జీవితములో నాచరించి పరివర్తన మొంది నపుడే ధన్యుఁడగును. ( బలదేవ్ సింగు నవ్వుచు కూర్చుండి ) సంగీత మా భగవంతుని యనుగ్రహము వలన లభించు వరము.

తానాజి :—నాయనా! సంగీతము, చిత్రలేఖనము, కవిత్వము మొదలగునవి సాధనములు. భగవంతుని సేవించుటకు సునిశిత కోమల సాధనములు. కాని, శుద్ధ క్షత్రియ వంశ జాతుడును నిశిత

ఖడ్గ ధారల పాపమును భేదించి ధర్మమును రక్షించి, భగవంతుని యనుగ్రహమును పొంద వాంఛించును.

బలదేవ్ :—యుద్ధ రంగమున శత్రువుల సంహరించి దిగంత విఖ్యాతి నొందుటలో రాజపుత్రు లగ్రగణ్యులు. విశ్వమునకు మార్గ దర్శకులు.

భిల్ల :—భారతదేశము గర్వమొంద దగిన మహా వీరులు.

తానాజి :—రాజ పుత్ర వీరా వతంసులలో జగత్ప్రఖ్యాతి గాంచిన వారు రాణా ప్రతాప్, మానసింహులు. రాణా ప్రతాప్ తుచ్ఛైహిక వాంఛలను బోనాడి, అక్బరు సార్వభౌమునితో హోరా హోరీ పోరి, ధర్మమును సేవించి, ఆదర్శ భారతీయుడై నాడు. మానసింగ్ భగవంతు డిచ్చిన క్షాత్రమును ఐహిక భోగముల కమ్మి తన మహాదాశయములచే ప్రజల నాకర్షింప బడలేక శంకితుడై, శపితుడై, పతితు డయ్యెను. నేటి రాజ పుత్రులు మానసింగు మార్గము నవలంబించు చుండిరి. రాణాప్రతాప్ మార్గము నవలంబింప వలయు నని మా కళారాధకుల ఆశయము.

భిల్ల :—తమ ఆశయము విపులీకరింప ప్రార్థితులు.

తానాజి :—మతము నారాధించుట మాని, మహీపాలుని సేవించు చుండిరి. స్వాతంత్ర్యమును సహజ స్వరూపమున జూచుటకు జంకి దాని నీడను ఆరాధించు చుండిరి. వ్యక్తులను వదలి ఛాయా చిత్ర ముల నారాధించు దురవస్థను త్యజింపు మని ప్రార్థించుచుంటిమి.

బల :—ప్రభు భక్తి మహర్షులు బోధించిన మూల సిద్ధాంతము కాదా !

తానాజి :—ప్రభువులు ధర్మమును రక్షించుటచే వారిని సేవించుటచే ధర్మమును రక్షించుటయే యను భావముతో నటుల శాసిం

చిరి. ఆ యభి ప్రాయమును గుర్తింపక చరించుట మూఢ విశ్వాసము కాదా !

బల :—శివాజీ అవలంబించు మార్గము సరియైన దని మీ నమ్మకము.

తానాజి :—నిస్సందేహముగ.

భిల్ల :—మన మెఱింగిన శివాజీ వేఱు. వీరు వచించు శివాజీ వేఱు. గాయక శిరోమణీ ! మీ శివాజీని వీరికి ప్రదర్శింపుఁడు.

బల :—వీరు కవులు.

తానాజి :—కాదు, ఆతని పదరజముల శిరసా వహించి జీవించు మహారాష్ట్రుఁడను. శివాజీ మహారాజ్ శాసింపని రాయబారిని. సింహగడ దుర్గము శత్రు కరముల నుండుట శివాజీకే కాక అఖిల భారత భూమి కవమాన మని నిరంతరము చింతించి విలపించు హిందువుడను.

బల :—శివాజీ ఆశయములను వినగోరు చున్నాను.

తానాజి :—వినుడు. దేశ దాస్యమున విలపించుచున్న భారతీయుల కష్ట పరంపర నిర్మూలించుటకై జన్మించిన మహావీరుడు శివాజీ. పరమతముల నార్య సాంప్రదాయములు పొందుచున్న అవమానములను తొలగించుటకు జన్మించిన శాక్తేయుడు, జిజియా సుతుఁడు. మత మను పేరిట స్త్రీలకు జరుగుచున్న పరాభవములను సమూలముగ పెల్లగించి మాతృ భావమును నెలకొల్పుటకు జనించిన శ్రీ జగద్గురు రామదాసు శిష్యుడు మా శివాజీ ! స్వార్థమును సమూలముగ పెల్లగించి తత్ స్థానమును విశ్వ మానవ ప్రేమను, సర్వ మత సహనమును, సమత్వమున స్థాపింప నుపక్రమించిన తుకారామ్ ప్రియ శిష్యుడు మా నేత —

బల :—ప్రభూ ! మీరు దీనిని సోదాహరణముగ నిరూపింప గలరా ! ఆతడు బందెపోటనియు, కొండ యెలుకనియు, సామాన్య సైనిక నియమములను గూడ పాటింప జాలని పతితుడనియు మే మెఱుగుదుము.

తానాజి :— బీజపూరు సుల్తాను కుమార్తె పేరు వినియే యుందురు. సౌందర్యో పాసకుల కామె ఆరాధ్య దేవత. రతీదేవి గర్వమును నిర్మూలింప ప్రత్యేక కృషి గావించి బ్రహ్మ సృష్టించిన సర్వాంగ సుందరి. బాహ్య సౌందర్యమును మించు గుణములు, గుణముల నతిశయించు నీతి గల యువతి. ఆమె తన యంతఃపురమున కరుదేర - బందీకృతయై, నిస్సహాయయై యరుదేర - మాతృభావమున బూజించి పంపిన భారతీయుడు - పంచములను, మహమ్మదీయులను తన సేనలలో నుంచి పోషించిన వదాన్యుడు. కూలిపోవుచున్న దేవాలయములను, తగులఁబడుచున్న వేదములను, అవమానింపఁబడుచున్న స్త్రీలను - మతాంతరులుగా జేయ బడుచున్న బ్రాహ్మణుల గాధలను నిరంతరము వినుచున్నాను, మసీదులను నిందింపని, కురానులను కాలితో మట్టని - మహమ్మదీయ స్త్రీల నవమానింపని - మతముపై దాడి వెడలని - మహా వ్యక్తిని నీ వూహింప గల్గినచో నాతడే శ్రీ శివాజీ మహారాజ్.

భిల్ల :—సింగుగారూ ! వింటిరా ! అటువంటి వ్యక్తిని సత్కరింపని మూఢు డుండునా !

బల :—అటువంటి వ్యక్తిని నమస్కరింపని మానవు డుండునా !

తానాజి :—ఇంకను వినుఁడు. యుద్ధ రంగమున పొర్లుచున్న కురానుల నెత్తి కన్నుల నద్దుకొని, ఆ గ్రంథములను చదివి, యర్థము చేసికొను నదృష్టము తనకు లేదని విలపించుచు నీ గ్రంథ

ములను మహమ్మదీయ సైనికుల కిచ్చువాడు నమాజుల ప్రోత్స హించును. మతమును గర్హించు మహమ్మదీయుని సైరింపడు.

బల :—అయిన, మహమ్మదీయ రాజ్యములపై దండయాత్ర యేల, రాజ్య కాంక్షయా !

భిల్ల :— అదియే మౌల్వీలు చెప్పు సాకు.

తానాజి :—శివాజీ తన సర్వస్వమును తన గురువగు సమర్ధ రామదాసు కర్పించి యాతని శాసనమున రాజ్యమును పాలించు చున్న సంగతి మీకు తెలియదా ! ఆతనికి రాజ్యకాంక్ష లేదు. ఆతడు మహమ్మదీయ మతమును కాని, రాజ్యమును కాని, ద్వేషిం చుట లేదు. మతమని పేరు చెప్పి, సామాన్యులను వంచించుచు స్వార్ధ పరులైన నృపాలురు తమ స్వార్ధమును, అహంకారమును పోషించు పద్ధతిపై యుద్ధమును సాగించు చున్నాడు. ఈ నాడు ఏ రాజపుత్రుడైనను ఆ భారమును వహించినచో ఆ రాజ పుత్రున కాతడు దాసుడై సేవించును. కాని, అంతటి మత భక్తి రాజపుత్ర లలో లేదు. ఆ రాజపుత్రులు ఔరంగజేబునకు పరమత సహనము, సమత్వమును బోధింప గల్గినచో ఆ ఔరంగజేబునే సేవించును. ఆ శక్తి కూడ రాజపుత్రులలో లేదని తెలియుటచే నాత డా కార్య భారమును వహించెను.

బల :—రాజపుత్రుల యందు మీ నృపాలునకు గౌరవము లేన ప్పుడు వారి నాశ్రయించుట రాజపుత్రులకు పరాభవము కాదా !

తానాజి :—తమ మతమును నిందించి యవమానించు చున్న మొగలాయీలను సేవించునపుడు పరాభవము పొందని రాజ పుత్రులు మహారాష్ట్రులను సేవింప జంకెదరా ! మా రాజు మిమ్మ లను రాజపుత్ర వీర గాధలచే నున్మత్తుల జేయును. రాజపుత్ర

వీర వనితల జీవితముల ధృవతారగ బెట్టి, యా బాలికలను వీర వని తలుగా సృష్టింప యత్నించును. రాణా ప్రతాప్ మా భారత వీరుడు. పద్మిని మా ఆదర్శ యువతి.

భిల్ల :—కాని —

తానాజి :—సందేహింపుచు -

భిల్ల :—తానాజీ వచ్చి రసపుత్ర వీరుల సాయ మడిగినచో — రసపుత్ర వీరుల సాహస కృత్యములను ప్రశంసించినచో —

బల :—అవును.

తానాజి :—(తనలో) శివాజీ యొక్కడే వీరు డనియు, ఆతని ముందు రాణా ప్రతాప్ కూడ నిలబడ లేడనియు విశ్వసించి, గ్రుడ్డి తనముగ నారాధించు మూఢ భక్తుడు. ఫాల నేత్రుడు మాన వాకృతిని వచ్చి, నేను శివాజీ కన్న ఘనుడనని వాదించినను తన ఖడ్గధార నాతని సేవకునికే సాటి రాదని ఋజువు చేయును. ఆ పిచ్చివానితో మీ కేల ? శివాజీయే మీ ఘనత నంగీకరించినపు డాతని సేవకుని మాట మీ కేల ?

బల :—మాకు సమ్మతమే. యుద్ధమును జేసి జయింప శివాజీని ప్రార్థించెదమా !

భిల్ల :—శివాజీ సేనలలో మనము జేరుటయే మంచిది.

తానాజి :—ఈ కోట కొన్ని గంటలలో శ్రీ శివాజీ చేతులలో పడవలయును. కనుక, ఆతని సేనలు రాగానే మీరు కోట తలుపు లను దీయుటయే మంచిది.

భిల్ల :—ఈ మధ్య మా యింటిలో వివాహ మగును, అంత వఱకు సైరింపలేరా !

తానాజి :—ఒక నిముస మాగుటకు వీలు లేదు. ఆలసించినచో జగత్పూజ్య యగు జిజియా చనిపోవును.

బల :—సరే, మీ యిచ్ఛ వచ్చినట్లే కానిండు.

భిల్ల :—సెలవా !

తానాజి :—ఇంక నే నెవరినో చెప్పిన భయము లేదను కొందును. నేనే శ్రీ శివాజీ చరణారవింద సేవకుడైన తానాజీని.

బల :—( సాష్టాంగ నమస్కారము చేసి ) పూజ్యపాదా ! మీ రాజ నీతిని నేను వింటిని. నేడు ప్రత్యక్షముగ జూచితిని.

భిల్ల :—( సాష్టాంగ నమస్కారము చేసి ) అయ్యా ! ఇంత సాహసము కల వీరులను చూడలేదు, వినలేదు. మీ పాదసేవ చేసి మేము ధన్యుల మయ్యెదము.

# 6 వ దృశ్యము

( తానాజీ శరపీడితుడై పడి యుండును. శివాజీ యొక వైపున, బలదేవ్ సింగు ఇంకొక వైపున )

శివాజి :—అమ్మ ఋణము తీర్చుకొన్నావు. అటువంటి అదృష్టము నాకు పట్టలేదు.

తానాజి :—ప్రభూ ! విచారించవద్దు. జనన మరణాలు దైవాధీనములు. వీరోచిత మరణము లభించి నందులకు ఆ జగజ్జననికి ధన్యవాదాలు.

బల :—అనుపమానమైన దేశభక్తి, ప్రభు భక్తి, రాజనీతి, అద్వితీయమైన సాహసము పుంజీభూతమై తానాజీ పరలోకయాత్ర సాగించటము భారతదేశ దౌర్భాగ్యము.

( ఇంతలో జిజియా ప్రవేశించి )

తానాజీ ! తానాజీ !

తానాజి :—అమ్మా ! విచారించకు !

జిజియా :—మూర్ఖురాలనై నిన్ను యుద్ధభూమికి పంపి ప్రాణాలు తీయించాను.

తానాజి :—అమ్మా ! నీ ఋణము తీర్చుకునే అదృష్టము నాకు కల్గజేశావు ; ధన్యవాదాలు.

జిజియా :—వివాహ వేదికకు పోవలసిన కుమారుణ్ణి ఆపి జనక హీనుణ్ణి చేశాను. నే నెంత క్రూరురాలను !

తానాజి :—అందరకు తండ్రి శ్రీ శివాజీ మహారాజే. నా కేమియు విచారము లేదు ; సర్వము ప్రభు పదాల అర్పించి పరలోకయాత్ర సాగిస్తున్నాను.

జిజియా, శివాజీ భగవద్ధ్యానము చేయుదురు.

గే య ం

వీరా ! వీరా ! వీరకుమారా ! ధీరా !
కదనరంగ విహారా !
వీరా ! వీరా ! వీరకుమారా ! ధీరా !
జీవన నాటక సారంబింతే – జీవితమే
మరణాంతకమే !
స్వర్గసీమలకు పయనం బపుడే
కీర్తి నిలుపుటకు తరుణంబదియే
వీర మరణమే విశ్వ సన్నుతమే
భగవదనుగ్రహ సంపాదితమే
తానాజీ భువి వీడితివా !
వీరా ! వీరా ! వీరకుమారా ! ధీరా !

బల :—ఆరిపోయింది జ్యోతి. ఆదర్శా లెరుగని ఈక్షుద్ర ప్రపంచములో జీవించనని ఆగ్రహించి అసువులు వీడిందా వీర జ్యోతి.

ఇంతలో తానాజీ కుమారుడు వచ్చి గొల్లుమని యేడ్చుచు

తండ్రీ ! నన్ను విడిచి పోయితివా !

శివాజీ మొదలగు వా రోదార్చెదరు

( తె ర ప్రా లు ను )

# 7 వ దృశ్యము

(తుకారాం మందిరము)

( పాండురంగ భజన సేయుచుండ శివాజీ తన్మయుడై
నిలువ బడును )

గేయం

ఇకేలా ! వృధా విచార మికేలా !
ప్రార్థనమే - గతియనన్
భవతారకమౌ సంప్రార్థనమే
యిహ పర తారకమౌ !
యికేలా ! వృధా విచార మికేలా !
దేవుడు జగతిని సర్వసంస్థితుడు
దేవుని లీలలె మన బ్రతుకు బాటలు
దేవుడు లేని జగమే లేదు
దైవ కృపను గోరు - యికేలా !
దైవకారుణ్యం బొకటేగా
స్వర్గసీమలకు దారీ - యికేలా !
నిత్య సంతోష దాయి !

( తుకారామ్, శివాజీ తన్మయత్వమున నానంద మొందుచుండ
శిష్యుఁ డరుదెంచి )

శిష్యుడు :— ప్రభూ ! శివాజీ మహరాజిచ్చట నుండెనని యెఱింగి మహమ్మదీయులు సేనా సమేతులై యరుదెంచు చుండిరి.

తుకారామ్ :— భయము లేదు. పాండురంగ విఠలే భక్తులను రక్షించును.

శిష్యు :—శివాజీ మహారాజును కెఱింగించినచో

తుకా :—ఆ అవిశ్వాసమును సహింపడు. నీవు పోయి, నీ పనిలో ప్రసన్నుడవై యుండుము.

సంకీర్తనము చేయుచుండగా తుకారామ్ మోకరించి ప్రభూ! పాండురంగ విఠల్! నీ భక్తుని రక్షింపుము. ఈతడు హిందూ మతమును రక్షింప నిరంతరము కృషి గావించు భక్తుడు.

శిష్యు :—(పారిల వచ్చి) భయంకరాయుధముల ధరించి వచ్చుచున్నారు. అప్రతిహతా వేశమున బీరములు పల్కుచు వచ్చుచున్నారు.

తుకా :— భయము లేదు. భక్తులను రక్షించుట పాండురంగని విధి.

శిష్యు :— మానవ ప్రయత్న మవసరము లేదా!

తుకా :—నాయనా! మూఢులు పురుష ప్రయత్నముపై నమ్మక ముంచి ఆత్మను వంచించెదరు. బుద్ధిమంతులా పరాత్పరుని నమ్మి తరించెదరు. పోయి నీ పనిని చూచుకొనుము.

శిష్యు :—కనీసము భక్తులనైన పంపించిన మంచిదేమో!

తుకా :—అవసరము లేదు. భక్తులైనచో భగవంతుడే రక్షించు. భీరువులైనచో డెక్కల చప్పుడు వినినంతనే వారే రక్షించు *కొందురు.

శిష్యు :—మీ కింత విశ్వాస ముండుట ప్రమాదకరమేమో!

తుకా :—అవిశ్వాసముండి నశించుటకన్న విశ్వాస ముండి మరణించుట మేలు.

( తుకారామ్ ధ్యానలగ్నుడై యుండును )

( మహమ్మదీయ సైనికులు లోన ప్రవేశించి తుకారామును పట్టుకొని ) దొరికాడు శివాజీ( తేరి పార జూచి ) కాదురా ! తుకారామ్ సాధువు. బాబూ ! క్షమించండి. పొరపాటు.

తుకా :—మీరు వచ్చిన కారణము ?

మహ :—శ్రీ శివాజీ మహరాజును బంధించుకొని రమ్మని ప్రభువుల ఆజ్ఞ.

తుకా :—భగవంతుని సేవించుచుండ బంధించుట మీ మత మంగీక రించునా !

మహ :—మహాత్మా ! భుక్తికి శరీర మమ్ముకొనిన మాకు మత మేమిటి ! స్వాతంత్ర్య మేమిటి ! ధర్మ మేమిటి !

తుకా :—అయిన సేనల నెచ్చట నుంచితిరి ?

మహ :—మీ మఠము చుట్టు

తుకా :—ఈ సామాన్య భక్తులతో మీకు కలహము లేదు కనుక, వీరిని పోనిండు.

మహ :—కాని, వీరిలో శివాజీ మహరా జుండునేమో !

తుకా :—శివాజీని మీ రిదివఱకు చూచితిరా !

మహ :—అనేక పర్యాయములు చూచితిమి.

తుకా :—అయిన, గుమ్మము చెంత నుండి మానవులను శోధించి అనుమానము తీరిన వెనుక పంపుడు.

మహ :—మా కా శ్రమ యెందులకు. మీరే శివాజీని చూపించి పుణ్యము కట్టుకొనుడు.

తుకా :—అదుగో ! ఆ నిలువబడి ధ్యాన మొనర్చుచున్న వీరుదే శివాజి.

( ఆనందముతో ఆతని చెంత కేగెదరు )

తుకా :—కాని, ఒక మాట. అతని భక్తికి మాత్రం భంగము రానీయ వలదు.

( సైనికులు చిత్తమని చుట్టు ముట్టెదరు. )

తుకా :—( తనలో ) ప్రభూ ! నీ భక్తుడు శత్రువుల చేతిలో జిక్కెను. ఆతని రక్షింపలేకుంటివి. ఇది నీ కెంత పరాభవమో నిన్నాశ్రయించుకొని జీవించు మా కెంత పరాభవమో ఆలోచించితివా ! భక్తాపాయ భంజనగ్రైనతేయుఁ డను బిరుదము నేటితో పోయి, శిలావిగ్రహ మను ప్రతీతి వచ్చును. దానివలన నీకు శ్రమ లేదేమో కాని, మా కెంతయో సిగ్గు.

శివాజి :—( ధ్యానమును చాలించి ) గురువర్యా ! ఆశీర్వదింపుడు, సెలవు తీసికొందును.

తుకా :—భక్తవర్యా ! నీవు బందీ కృతుఁడవు.

శివాజి :—అనిన.

తుకా :—మహమ్మదీయ సైనికులు నిన్ను బంధించిరి.

శివాజి :—హిందూ దేవాలయములో భక్తులను బంధించుట కెవరికి నధికారము లేదు. సైనికులారా ! మీరు దూరముగఁ దొలఁగి పొండు. ఈ దేవాలయము నవమానింపకుఁడు.

తుకా :—( ఆశీర్వదించును )

శివాజీలో అత్యద్భుతమైన తేజస్సును గాంచి భయభ్రాంతులై పారి పోవుదురు.

తుకా :—( శివాజీని కౌఁగిలించుకొని ) నాయనా ! నీ వవతార మూర్తివి. రాజకీయమందే కాక భక్తి మార్గమున నీ వత్యున్నత స్థానము నాక్రమించితివి. నీ సాటి యెవరును లేడు.

శివాజి :—పుత్ర వాత్సల్య మటుల అనిపించును.

తుకా :—కాదు నాయనా ! నా ప్రార్థనచే యే దైవ శక్తిని ఆ సైనికులకు చూపించి, పదివ స్త్రసముఖు తేలేక పోయితినో ఆ దైవ శక్తిని అయాచితముగ వారికి చూపించి వారిని తరింప జేసితివి.

శివాజి :—ఇది యంతయు గురువుల ఆశీర్వచనము. సెలవు.

తుకా :—నిన్ను పాండురంగ డెప్పుడును ఆశీర్వదించును గాక !

గేయం

వీరవర్యుడవు కాదా !
భారతీయ మర్యాదా !
ప్రతిక్షణలతో బాహు బలంబున
వందిత విజయము తేవా !
వీరవర్యుడవు కాదా !
భారతీయ మర్యాదా !
జగతి నుతించు జనని సుఖించు
ఈవే విజేత వౌరా !
శూర సంతతులు స్తోత్రంబీయ
శోభన మూర్తివి గావా !
భారతీయులకు సుఖభిక్ష సిడగ
ప్రభవించితివా యీ యిలా !
ఓ శివాజీ ! భారత జ్యోతీ !
ఆయుష్మంతుడ వోయీ !

( తెర వ్రాలును )

# 8 వ దృశ్యము

( ఔరంగజేబు ఆస్థానము )

( ఆస్థాన గాయకుల పాట )

సరసుడా నీ చెంతజేరి మురిపె మందితిగదరా !

మేలైన చీర గట్టి కస్తూరి బొట్టు పెట్టి

నీ రాక చూచుచుంటిని గదరా !

పదరా ! పూపొదలదరికి పండువెన్నెల దిగో

మనసార మోముజూపగ దేరా !

లే గులాబీ తోటలోన సెలయేటి నీటిలోన

మురుపుమీర మునుకలిడుదము రార !

సరసుడా నీ చెంతజేరి మురిపెమందితి గదరా !

పేటదాటి కోటదాటి పేరైన పురముదాటి

ప్రేమ నగరికి వెడలిపోదాం పదరా !

నీవూ నేనన్న భేదము యేమీ లేకుండగానే

నిర్మలంబుగ బ్రతుకుదాం పదరా !

మనసు మనసూ కలిసిపోతే మాయలోక బాధలేక

ప్రేమపూజకు పూలుతెద్దాం పదరా !

సరసుడా నీ చెంత జేరి మురిపెమందితి గదరా !

జయసింహ :—ఔరంగజేబు సార్వభౌమా ! శివాజీ పరిచయము వలన ప్రభువుల నూత్న వికాసము లభించు నను నాశతో వాని నిటకు గొని వచ్చితిని.

ఔరంగ :—నీ ప్రభు భక్తికి సంతసించితిని. అటువంటి యవకాశము నీవు తక్క యితరులు కల్పింపలేరు. శివాజీ ఖ్యాతి నిది

వఱకే విని, యటువంటి మహాపురుషుని దర్శనమునకై తహ తహ లాడుచుంటిని. నేటికీ నీ సాయమున లభించినది.

శివాజి :—ఔరంగజేబు సార్వభౌమా ! నమస్కారము.

ఔరంగ :—శివాజీ, రమ్ము ! ఈ స్థానము నలంకరింపుము. నీ సాహచర్యమున మా సభ నూత్న తేజమున విరాజిల్లు చున్నది. దిలేర్ ఖాన్ ! రాజపుత్ర వంశమున దుర్గాదాసు, మహారాష్ట్ర వంశమున శివాజీ అద్వితీయ వ్యక్తులు.

ది :-ప్రభువుల ప్రశంసకు పాత్రు లగుటచే వారెంతయు ధన్యులు.

ఔరంగ :—ఇటువంటి భక్తులు మన మతమున నున్నచో నెంతయో రాణించి యుందురని మన మౌల్వీల అభిమతము.

జయ :—ప్రభూ ! ఈ మహావ్యక్తి —

ఔరంగ :-జయసింహా ! సూర్యునిదివ్వెతో చూపింపయత్నించు చున్నావు.

జయ :—కాని, అటువంటి వ్యక్తిని గౌరవించి —

ఔరంగ :—జయసింహా ! కొన్ని ముఖ్యములైన రాజకీయ విషయము లుండుటచే వారి విషయమును జర్చించుటకు వీలులేదు. మరల నింకొక సమయమున జర్చించెదము. దిలేర్ ! శివాజీకి రాజమర్యాదల ననుసరించి యొక భవనమున విడిది నిచ్చి, సౌకర్యముల నేర్పాటు చేయుము.

( శివాజీ సెలవు తీసికొని వెళ్లుచుండ జయసింహుడు వెంట పోవుచుండ ) జయసింహా ! నీతో కొన్ని రహస్య విషయములను చర్చింప వలయును. ఉండుము.

( శివాజీని దిలేర్ వెంట నిడుకొని వెడలిపోవును )

ఔరంగ :—జయసింహా ! నా సామ్రాజ్యమంతయు సముద్రము వోలె భయంకర భంగములచే చెలరేగి పోవుచున్నది. దాని

శాసించుటకు నీ వొక్కడవే సమర్థుడవు. కనుక, దక్షిణా పథము నకు వెంటనే పోయి, బీజపూర్, గోలుకొండ సుల్తానులను శాసించి రావలయును.

జయసింహ్ :—శివాజీ మన కతిథియై యుండ, నే నాతని వదలి పోవుట న్యాయమా ?

ఔరంగ :—అటువంటి మహాపురుషు లెన్ని దినము లున్నను మనకు శ్రమయా ? మఱల వచ్చిన తర్వాత విషయములను చర్చించి వానికి దర్బారులో తగు స్థానమీయ వచ్చును.

జయ :—ఆ పని ముగిసిన వెనుకనే నేను దండయాత్ర కేగిన మంచిదేమో ?

ఔరంగ :—శివాజీ యెన్ని దినములైన నిట నుండగలడు. ఆతడు లేకున్నను రాజ్యమును సక్రమముగ బాలింపగల మంత్రులు, శత్రువులను శాసింపగల సర్వ సేనాధిపతులు, ప్రజలను ఆధ్యాత్మికముగ సంస్కరింపగల భక్తులు, తమ లలిత కళలచే ప్రజల నున్మత్తుల గావించి దేశ భక్తుల జేయు కళారాధకులు కలరు. కనుక, ఆ విషయమున తొందర లేదు.

జయ :—తమరు సంధి కను వగు దానిని వాగ్దాన మిచ్చినచో

ఔరంగ :—జయసింహ్ ! ఈ సామ్రాజ్యములో నే నెవరినైన గౌరవించిన యెడల, ఎవరి వాక్యమునైన శిరసా వహించిన యెడల, ఆతడు జయసింహుడని నమ్ముము. దక్షిణదిశ కేగి జయ శ్రీని వెంటనిడి కొనిరమ్ము.

జయ :—ప్రభువుల యాజ్ఞ— ( అని వెడలును )

ఔరంగ :—నేటికి సభ ముగించెదము.

( తెర వ్రాలును )

## 9 వ దృశ్యము

( చెరసాలలో శివాజీ మంచముపై పరుండె వైద్యుడు ప్రక్కనుండును )

వైద్యుడు :—జయసింహ అమాయకుడు. ఔరంగజేబు మిమ్ము లను గౌరవించుననియు, సంధి కావించుననియు నమ్మి, దక్షిణ దిక్కునకు దండయాత్ర కేగెను.

శివాజి :—నేను మొదటనే చెప్పితిని. రాజపుత్రులకడ రాజనీతి లేదని, ఔరంగజేబు వంచకాగ్రేసరుడని, ఆ నాడు సభలో నాతడు నన్ను పొగడి జయసింహుని నోరెత్తకుండ జేసెను.

వైద్యు :—మీ అవస్థ చూచినచో నాకు జాలి వేయుచున్నది. తీవ్రమైన ఆలోచనలచే కొంచెము వేడి చేసినది, జ్వరము లేదు.

శివాజి :—జ్వరము చేసిన దని దిలేర్ యెదుట చెప్పినచో నే నీ చెరనుండి విముక్తుడను కాగలను.

వైద్యు :—ఎట్లు ?

శివాజి :—( చెవిలో చెప్పును )

వైద్యు :—శివాజీ మహరాజ్ ! నీ గుండె నిబ్బరమునకు నే నెంతయో యబ్బుర మొందుచున్నాను. ఆ మార్గములో గల చిక్కులను చర్చించితిరా !

శివాజి :—పైన భగవంతు డున్నాడు. మీరు చేయగలిగిన సాయమును చేయుడు.

వైద్యు :—నేను హిందువుడను. ఉదర పోషణార్థము పరమత స్థుల నాశ్రయించినను అభిమాన మెక్కడకు పోవును. కాని, మీ మార్గమున నష్టములు చాల గలవని నా భయము.

శివాజి :—భయము లేదు.

వైద్యుడు :—అడుగో దిలేర్ వచ్చుచున్నాడు.

( దిలేర్ వచ్చి, శివాజీకి సలామ్ చేయును. ఆతడు మరల సలామ్ చేయును.)

దిలేర్ :—కవిరాజ్, శివాజీకి జ్వరము వచ్చినదని విని చాల విచారించితిని.

వైద్య :—దిలేర్‌సాబ్ ! ఇది విచిత్రమైన జ్వరము. దీనికి గ్రహకూటములు వక్రించుట వలన విచిత్రగతి కల్గింది. మంత్ర శాస్త్రమం దభినివేశము కలవారు కాని, దీనిని కుదర్చ లేరు.

దిలేర్ :—( నవ్వి ) వైద్య మహాశయా ! మీ హిందువుల కీ పిచ్చి నమ్మకా లెప్పుడు పోతాయి ?

వైద్య :—హిందువులందరు తమ మతముతో ప్రళయ గర్భములో లీనమైనప్పుడు.

దిలేర్ :—అయితే మందుల వలన ఈ రోగము కుదరదంటారా.

వైద్య :—అది రోగి చెంత మీ రడగవలసిన ప్రశ్న కాదు.

దిలేర్ :—అయితే మంత్ర శాస్త్రజ్ఞులకు కబురు పంపించమంటారా ?

వైద్య :—వీరిది దక్షిణ దేశము. మనది ఉత్తరదేశము. పంథాలు మారుతాయి.

దిలేర్ :—మీరు ఆ మంత్రాలను చెప్పలేరా ! మీలో ఎవరైనా కురాన్ చదువగలరా ?

వైద్యు :—మీ అంత గొప్పవారము మేము కాదుకదా !

దిలేర్ :—ఐతే యిప్పు డేమి చేయమంటావు ?

వైద్యు :—వైద్య శాస్త్రములో ఆ విషయము వ్రాసి ఉండదు. ఆ సమయములో వా రేమి చేస్తారో అడిగి ఆ విధముగా చేస్తేనే మంచిది.

దిలేర్ :—శివాజీ భాయి ! జ్వరము వచ్చినప్పుడు మీ దేశములో ఏమి చేస్తారు ?

శివాజి :—దేవికి నైవేద్యము పెట్టి, ఆ మిఠాయిని బ్రాహ్మణులకు పంచిపెట్తారు.

దిలేర్ :—ఎంత మిఠాయి ?

శివాజి :—హోదాను బట్టి.

దిలేర్ :—( ఆలోచించి ) వైద్య మహాశయా ! ( దూరముగా తీసికొని వెళ్ళి ) ఇందులో మోస మేమి లేదు కదా !

వైద్యు :—ఇంత అనుమాన ముంటే జీవిత యాత్ర గడపటం యెట్లు ? బుట్టలో దూరి పారిపోతాడనా ! అది యెల్లాగ సాధ్యమౌతుంది? అయినా, ప్రతి బుట్ట మనము పరీక్షించ వచ్చునుకదా !

దిలేర్ :—ఊరకే అడిగాను. అల్లాగే కానియ్యి.

( శివాజీ చెంతకు వచ్చి ) భాయీ ! అల్లాగే కానియ్యి. మీ వంటి మహావీరులు పది కాలాలు పాటు జీవించటమే మావంటి వాళ్ళకు కావలసింది. ఏ మతానికి చెందినా, ఏ జాతికి చెందినా వీరుణ్ణి ఆరాధించ వలసిన విధి మనది. సెలవా !

శివాజి :—కూర్చోండి. మీతో కొన్ని విషయాలు మాట్లాడాలి.

( దిలేర్ కూర్చొనును )

శివాజి :—నే నిక్కడకు వచ్చినప్పటి నుండి పరీక్షిస్తున్నాను. ఇంత మంచి మహమ్మదీయ ప్రజ లంతటి క్రూర నృపాలుని యెల్లాగ సేవిస్తున్నారా అని.

దిలేర్ :—భాయీ ! ఔరంగజేబు చెడ్డవాడని మహమ్మదీయే తరులు భావిస్తారు. ఆ భావనలో సత్యము లేకపోలేదు. కాని, మా మహమ్మదీయుల కాత డారాధ్య దేవుడు. భోగ భాగ్యాలను బహిష్కరించాడు. వ్రాసన కురాను ప్రతులను అమ్మి, ఆ ధనము తోనే జీవిస్తున్నాడు. మద్యపానాన్ని నిషేధించాడు. కురాన్ ప్రచారము అనుపమానముగా సాగిస్తున్నాడు. అంత కంటె పవిత్ర మహమ్మదీయు డెక్కడ లభిస్తాడు ?

శివాజి :—పర మతాలను ద్వేషించి, ఆ గ్రంధాలను ఆ దేవాలయాలను తగలబెట్టమని మీ గ్రంధాలలో ఉందా !

దిలేర్ :—ఔరంగజేబును రాజు, మత ప్రచారకుడు అను రెండు దృక్పధాల నుంచి జూచే అదృష్టము తక్కువమంది కుంటుంది. ఔరంగజేబు సింహాసన మెక్కి పాలించటాని కనర్హుడు. హిందువులు మహమ్మదీయులు కలసిన రాజ్యాన్ని పరిపాలించటాని కనర్హుడు. కాని, ప్రత్యేక మహమ్మదీయ రాజ్యాన్ని పాలించటానికి ఆ మతాన్ని ప్రచారము చేయటానికి ఆతని మించిన రాజు లేడని మా నమ్మకము.

శివాజి :—అక్బరు సర్వ సమత్వము కల్గి హిందువులను మహమ్మదీయులను సమముగా పరిపాలించలేదా !

దిలేర్ :—అక్బరులో మతము లేదు. రాజనీతిఉంది. హృదయము లేదు. మస్తిష్క ముంది. సత్యసంధత లేదు. పరహృదయాలను

వశమొనర్చుకొని వారిని శాసించే శబ్దజాలముంది. పవిత్రత లేదు. ఆడంబర ముంది. కనుక, ఔరంగజేబు మహమ్మదీయుడు కాని, భారతీయుడు కాడు అని చెప్పగలను. అక్బరు విషయములో ఆత నికి మహమ్మదీయుడని కాని, భారతీయుడని కాని పిలుపించుకోవ టాని కధికారము లేదని నా నమ్మకము.

వైద్య :—అని మీ చరిత్రలు సాక్ష్య మిస్తున్నాయా !

దిలేర్ :—మా హృదయాలు సాక్ష్య మిస్తున్నాయి. చరిత్రలు అనేక పరిస్థితులలో అనేక వ్యక్తులచే వ్రాయబడి ఉండటము వలన సత్యానికి చాల దూరముగా ఉంటాయి. కాని, సంస్కరింప బడిన హృదయాలన్నీ సత్యాన్నే వెలిబుచ్చుతాయి.

వైద్య :—( నవ్వుతో ) ఐతే మీ హృదయము సంస్కరింప బడింది అంటారా !

దిలేర్ :—ఆ మాత్రము స్వాతంత్ర్యము నా కుండాలి అని అను కుంటాను.

శివాజి :—అయితే, రాణా ప్రతాప్‌కు మీ రెటువంటి స్థాన మిస్తారు ?

దిలేర్ :—మా చక్రవర్తికి మీ రెటువంటి స్థాన మిస్తారో మేము మీ రాణా ప్రతాప్ కటువంటి స్థాన మిస్తాము.

శివాజి :—కాని, ఆతనిలో ఉన్న దేశాభిమానము మీ చక్ర వర్తిలో ఏది ?

దిలేర్ :—ఇది మా దేశము కాదు కనుక, ఆ అభిమానము మీకు అర్థము కాదు, సెలవు. మీరు విశ్రాంతి తీసికోండి.

వైద్య మహాశయా, సెలవు! తగిన జాగ్రత్త తీసికొని మాట దక్కించండి. ఆయన అద్వితీయ మూర్తులు.

వైద్య :—మీరు చెప్పాలా!

( దిలేర్ వెడలి పోవును )

శివాజి :—మహావీరుడు. సరళ హృదయుడు. వీరులను ఆనందించి, సత్కరించే మహాయోధుడు దిలేర్.

వైద్య :—ఇటువంటి వ్యక్తులు కొంతమంది ఉండటము వలననే సామ్రాజ్యము కూలకుండా నిలబడింది. నేను వెళ్ళి వస్తాను జాగ్రత్త!

శివాజి :—భయములేదు. నమస్కారము!

వైద్య :—శ్రీ పరమేశ్వరార్పణమస్తు!

( తెర వ్రాలును )

# 10 వ దృశ్యము

(జిజియా విచారగ్రస్తయై యుండును. మోరోపంతు ప్రక్కన నిలువబడును)

జిజియా :—మోరోపంత్ ! అబ్బాయి ఢిల్లీకి వెళ్ళి చాల దినాలైంది. వార్త లేమీ రాలేదా ?

మోరో :—అమ్మా ! గూఢచారుల దృష్టికి కూడ అందకుండ ఔరంగజేబు కుటిల నీతి సంచరిస్తోంది. ప్రభువుల జాడలు తెలియటము లేదు. కాని, భయము లేదని అంతరాత్మ చెబుతోంది.

జిజియా :—తుకారామ్ దర్శనము చేసి వస్తే మంచిదేమో ?

మోరో :—అవసరము లేదు. వారే తమ దర్శనానికి వస్తానని వర్తమాన మంపారు.

జిజియా :—కారణము ?

మోరో :—శివాజీ మహరాజు విషయమై మీరు ఆరాట మొందుచున్నారని విని ఆశ్వాసించుటకు.

జిజియా :—వారికి మనయం దెంత అభిమానమో !

మోరో :—మొన్న సమర్థ రామదాసుప్రభువు పంపిన ఉత్తర మెంత గంభీరముగ నున్నది.

జిజియా :—ఈ సమయములో తానాజీయే జీవించి యున్నచో—

మోరో :—కాని, తానాజీ అంతరాత్మ నిరంతరము శివాజీ మహరాజు యోగ క్షేమములకు తహ తహ లాడుచుండు నని నా విశ్వాసము.

(తుకారాము భగవద్ధ్యానము చేయుచు ప్రవేశించును)

గేయం

రంగని మహిమా ! తెలియగ తరమా !
మూఢుల కీ భువిలో !
మమతను వీడీ సమతను గాంచీ
సర్వ సమానుని గనరా నరుడా !
రంగని మహిమా ! తెలియగ తరమా !
మూఢుల కీ భువిలో !
పాడు మోహంబు గన బోకుమురా
కాంతా కనకంబుల ఆస వీడరా
ద్రోహివై మోసము చేయకురా
ఈశ్వరు కన్నుల కప్పగలేవూ
పాప ఫలము తప్పదురా ! నరా !
రంగని మహిమా ! తెలియగ తరమా !
మూఢుల కీ భువిలో !

( జిజియా నమస్కరించును ) ( తుకారామ్ ఆశీర్వదించును. జిజియా పాదపూజ చేయును )

తుకా :—అమ్మా ! విచారింపకుము. పుత్ర వ్యామోహమున పామరత్వమును పొందకుము. శివాజీ భక్తావతంసుడు. ఆతని కెవ్వరు నపకారము చేయజాలరు. మొన్న మా మందిరమున జరిగిన లీలను గాంచిన నాటి నుండియు శివాజీని బంధింపగల శక్తి ప్రపంచమున లేదను గాఢ విశ్వాసము నాకు గల్గినది.

జిజియా :—నిజమే. కాని, వెళ్ళినది దూర దేశము. మమకారమిసుమంతయు లేని శాత్రవ కుటుంబము. అందులకే విచారించు చుంటిని.

తుకా :—( నిమీలిత నేత్రుడై ) అమ్మా ! శివాజీ గృహోన్ముఖుడై యరుదెంచు చున్నాడు. భయ మొందకుము.

జిజియా :—అంత అదృష్టమా !

( ఇంతలో శివాజీ, వైద్యులు ప్రవేశించి తల్లికి, తుకారాముకు నమస్కరించెదరు )

తుకా :—నాయనా ! ఇప్పుడే అమ్మతో చెప్పుచుంటిని. నీ వంటి యత్యద్భుత శక్తిని బంధించు నరపాలుడు జన్మించలేదని.

వైద్య :— జన్మించెను. కాని, ఆతని కళ్ళలో కారము కొట్టి వెలుపలకు వచ్చెను.

తుకా :— ఎట్లు ?

వైద్య :—జయసింహ ననుసరించి, శివాజీ దర్బారునకు రాగానే ఈతని నతమస్తకుని గావింప చిన్న ద్వారమును - గుడ్డలతో చిత్రకారుని చమత్కారమున లోహమువలె గాన్పించు విధమున నిర్మించెను. ఆత్మాభిమానము కల శివాజీ తన మస్తకమున దాన్ని చ్ఛేదించి, ప్రభూ ! నీవు నన్ను బంధింపగలవు. కాని, లొంగదీయ లేవు ' అనునట్లు లోని కరుదెంచెను.

తుకా :—( సంతోషముతో ) వింటివా అమ్మా ! ఆ సమయమున దేవతలు పుష్ప వృష్టిని గురిపింప లేదా !

వైద్య :—అప్పటి హిందువుల హృదయములన్నియు వికసించి, ఆతని సువర్ణ విగ్రహములకు వాసయోగ్యములుగ జేసి తమ సంతోషమును నేత్రముల మూలమున వెలిబుచ్చిరి.

జిజియా :—తర్వాత !

వైద్య :—ఔరంగజేబు శివాజీని అనేక విధముల ప్రశంసించి జయసింహు నోరు కట్టి ఆతనిని దక్షిణ దిశకు దండయాత్రకు బంపెను. ఆ సమయమున ప్రభువును చెరయందుంచెను.

తుకా :— రాక్షసుడు - శ్రీకృష్ణుని బంధింప యత్నించు దుర్యోధనుడు.

జిజియా :—తర్వాత యేమి జరిగినది ?

శివాజి :—ఈ మహాత్ముని సాయమున బయట పడితిని.

తుకా :—ధన్యుఁడవు నాయనా ! భగవంతుడు నిన్నాశీర్వదించుగాక !

జిజియా :—ప్రభూ !

గేయం

శూర సన్నుతులు వీర వర్యులు
భారత పుత్రులు గారా !
కదన భూమిలో
కత్తిని దూయుచు
విజయ లక్ష్మిని
తేరా !
శూర సన్నుతులు వీర వర్యులు
భారత పుత్రులు గారా !
పగతుర నెల్లర
ఖండనంబులో
చించి చెండాడ
లేరా !
శూర సన్నుతులు వీర వర్యులు
భారత పుత్రులు గారా !

తుకా :—అభిషేకించుట కిది సమయము కాదు. కాని, ఈ సింహాసనమున నిల్పి, నీ చేతులతో హేమ కిరీటమును నెత్తిపై నిల్పుము.

# నవ్య నాటకములు

రసవత్తరముగా రంగానుకూలముగా ప్రదర్శన కుప యుక్తమైన మహత్తర నాటకము. వెల రు 1-8-0

## భక్త త్యాగయ్య (తుళ్ళలేని తెలుగు నాటక ప్రచురణము)

రచన :—కవితావిశారద శ్రీ అయ్యగారి విశ్వేశ్వరరావు B. A

బ్రతికినన్నాళ్లు తారకమంత్రోచ్చారణచేసి-తమిళ దేశీయ సావాసమొనర్చిన తెల్గుతనాన్ని సార్థకపఱచుకొన్న ధన్యజీవి త్యాగయ్య. ఆ పవిత్రమూర్తి ఆదర్శచరిత్ర నవ్యనాటకంగా వెలువడింది. వెల రు 1—8—0

## ప్రచండభీమకవి (సాటిలేని మేటి నాటక ప్రచురణము)

రచన :—కవితావిశారద శ్రీ అయ్యగారి విశ్వేశ్వరరావు B. A

రాజుకన్న కవిరాజు ప్రతిభాశాలి అని ఋజువుచేసిన తెల్గు వీరుడు. తన ఆశీస్సుతో నందనవనాలను — తన శాపాలతో స్మశానవాటికలను సృజించి కవి అపర బ్రహ్మ అని సార్థకం చేసిన కవిభీముని కథ. రంగాను కూలమైన రసవత్తర నాటకం. వెల రు 1-8-0

వలయువారు :

కాళహస్తి తమ్మారావు అండ్ సన్స్,

సంస్కృతాంధ్ర బుక్ డిపో, (స్థాపితం 1832) రాజమండ్రి.

శ్రీ రాజేశ్వరీ ప్రెస్, రాజమహేంద్రవరం.

## దృశ్యనాటికలు

| | |
|---|---|
| భార్యలసమ్మె | 1- 0-0 |
| నర్తనశాల | 1- 0-0 |
| చరణదాస్ | 1- 0-0 |
| మహారాజ్ శివాజీ | 1- 0-0 |
| పల్లెపిల్ల | 1- 8-0 |
| కులంలేనిపిల్ల | 1- 8-0 |
| ఎస్. జీ. ఓ. | 1- 4-0 |
| ప్రగతి | 0-12-0 |
| మేడిపళ్లు | 1- 0-0 |
| పవిత్రులు | 1- 8-0 |
| ఎర్రబుట్టలు | 1- 8-0 |
| తుదిగడియలు | 1- 0-0 |
| అంతర్వాణి | 1- 4-0 |
| శత్రువులు | 1- 8-0 |
| తెరచాటు | 1- 4-0 |
| అశోకనరకం | 0- 8-0 |
| సందేశం | 0- 8-0 |
| నిరుద్యోగి | 0- 8-0 |
| బహిష్కరణ | 1- 8-0 |
| నేటినటకులు | 1- 4-0 |
| ఏమిమగవాళ్లు | 0-12-0 |



ప్రాప్తిస్థానం:

**కె. తమ్మారావు & సన్సు,**

రాజమహేంద్రవరం.